౫౧. తలిదండ్రులు జీవేశులు । యిలవ్యోమము లేను నేను। లెరుక మరుపులుగ । కలమిల్కలు శుక్లాశ్రంబులు । నీరాన్నములు ప్రకృతి పురుషుడాల్మగడూ ॥ గానై యెరుక కెరుకేకానబడూ। తెలశీ బయలున్నాది దెలశి యా తెలివినీ । తెలివి చాతనెబట్టి తీశివెయ్యుము ॥ ప్రకృతి పురుషూడాల్మగడూ । గానై యెరుక కెరుకేకానబడూ॥

౫౨. ఆటాడి ఆడకుంతును । ఆటాడిన మేనుబొమ్మ యాటాడకనే । ఆటాడు యెరుక యనియెడి । యాట్లాడించేటివాడు అతడేరా కర్తా । అంతటికీయీ అచలమకర్తా । చేటుపాటుల రెంటి చేవొచ్చుఫలము । ముమ్మాటికనుభవించి । జననమరణములొంద । నతడేరకర్తా । అంతటికియీ అచలమకర్తా ॥

౫౩. దేహమును జూచుకన్నులు । దేహమునకు వేరులేని తీరున । యెరుకే కోహం కస్త్వం । తవదాసోహం సోహంబటంచు। చూచుచుండుసుమీ । తనకుతానె తోచుచుండుసుమీ । దేహి దేహములానె తెరగున ప్రసరించి । దేహముగాని విదేహిగ। తనను తా జూచుచుండుసుమీ । తనకుతానె తోచూచుండుసుమీ ॥

౫౪. పరిపూర్ణ మొకటిదక్క । నితరమైన ప్రపంచమెల్ల । దగదెలియుము ।. నీ వెరుకేనని మదిలోపల । యెరుకే పరిపూర్ణ మెరిగే దెరుకానరిగేదీ । యింకొకటిలేదీ రెంటిన్నరిగేదీ । యెరుకా పుట్టువుమూల మెరుగానిదీయెరుకే। యెరుకేతాబుట్టీనదెరుగబోయితే। లేదంచెరుకా నెరిగేదీ । ఇంకొకటిలేదీ రెంటిన్నరిగేదీ ॥

౫౫. పాపములు పుణ్యములు । భువి ప్రాపించును । యెరుక చేత భ్రమశినవారిక । ప్రాపించ వెరుక నెడశిన తాపసులను। చిత్తమందు తగదెల్సుకోనుమీ । ఆగామీ బోధనులెస్స వినుమీ । పాపాలలోశుద్ధ స్పటిక సన్నిభమైన । ఆపోజ్యోతిని ప్రత్యగాత్మనీ । మదిలోన తగదెల్సుకోనుమీ । ఆగామీ బోధనులెస్స వినుమీ॥

౫౬. యెరుకన్నను మరుపన్నను । యెరుకకు యెరుకన్న దేహి యనమాయయనక । గురుతన సాక్ష్యన జ్ఞప్త్యన । స్ఫురణయనక ద్రష్టయనిన । చూడుమొక్కటిగా । యిదిలేకుంటె చూడమొక్క

టిగా । మరి చలాచలమూల మర్మమెరిగెటిదన్న । యెరిగితాలేనాని యెగిరిపొయ్యెటిదన్న ॥ చూడుమొక్కటిగా । యిదిలేకుంటె చూడ మొక్కటిగా ॥ * * * * *

౫౭. అనుమానము మదినుంచక । వినుమింకను యెరుక పేర్లు వివరించెద । బుద్ధ్యనచిత్తంబన । మానసమనినహంకారమనిన। నంతఃకరణనినా । సంకల్ప మంచని నాయిచ్ఛనినా । తననితరులనే తానని గుర్తెరిగెటిదన్న । తననేకానితరూల ॥ తనను దెలిశెటిదన్న నంతకరణనినా । సంకల్పమంచని నాఇచ్ఛనినా ॥

౫౮. తనువెరుకలు రెండొక్కటి । యని యనరాదనుచు కొంద రందురుభువిలో । తను వెరుకలలో । నొక్కటి । గనరా కుంటేను । రెండు గనరావోయన్నా । రెండొక్కాటె వినరామా యన్నా । అనుమాన మికయాల । అందారిమాటాలు । వినబోక । నేబోధించినరీతి నెప్పుడు । గనరా వోయన్నా । రెండొక్కాటె వినరామాయన్నా ॥ * * *

౫౯. కనకమనభూషణంబులు । యినుమన శస్త్రాదికంబు । యిత్తడియనినా । గనుగొనపాత్రలు గనుపడు । తనువన నవయవములన్ని తగదొంతియనినా । కుండలు । భూతతతి జగత్తనినా । వినుమిట్ల యెరుకన్న వివరించతత్వాలు । మనుసందు గట్టిగ మరువాకు మీామాట । తగదొంతియనినా। కుండలుభూతతతిజగత్తనినా॥

౬౦ పొరలరటి దుంపయనినను । తరువులు వనమనిన । రవలు ధారుణి యనినా । గిరియనిన రాళ్లు । బట్టలు ధరముళ్ళియ యనిన । తత్వతతి యెరుకంచని నా । లేనిదెయెరుక స్థితిలెస్సకనినా। యరుకా జేసిన విశ్వ మెరుకవంటిదె బయలు । యెరుకాగుర్తెరిగి । తానేగితెసరి । తత్వతతి యెరుకంచనినా । లేనిదెయెరుక స్థితిలెస్స కనినా ॥ * * * * *

—( బయలెరుకల యత్యంత విభిన్నతత్వము )—

౬౧. దానము ధర్మము సగుణ । ధ్యానముప్రతిమార్చనంబు తజ్జపతీర్థస్నానము । లివిముక్తిదమని । మానవు లొనరించ బయలు

మాటాడ దేమీ । యెరుకేలేదు మాటాడ దేమి । ఔను కాదనకానీ వనక నేననకొక్క । మేనైన తాగాక మితిమీరియున్నాది। మాటాడ దేమీ । యెరుకేలేదు మాటాడ దేమీ ॥ * *

౬౨. ఆకాశాదిక భూతా । నీకాత్మక మగుచు యెరుక । యీజగమయ్యేక । రాకడ పోకడ దీనికి । ప్రాకటముగ దేనిలోనా బట్టబయలదిరా । కాదనియంటె వట్టిపల్కుదిరా। లోకత్రయముతన లోపాల దిరుగాగ । జోకతో డుతదాని జోలెరుగ నిదియేదో । బట్ట బయలదిరా । కాదనియంటె వట్టినల్కుదిరా ॥

౬౩. తండోప తండములుగా । దండిఝషాదికములన్ని తన లోపల । నుద్దండత నుండిన పోయిన । నుండుసముద్రంబుయెరుగా కుండూ నెప్పటికీ । పరిపూర్ణా మిట్లుండు నెప్పటికి । యెండమా వులరీతి నుండేటి బ్రహ్మండ । ముండీన పోయిన రెండుగు రైరుగాని । దుండూనెప్పటికీ । పరిపూర్ణ మిట్లుండు నెప్పటికీ ॥ *

౬౪. యెరుకతో వచ్చిన విశ్వము । యెరుకతో జనుగాని నిల్వాదీ । బయలైతే । యెరుకతోరాదెరుకతోబో । దెరుకతనందేమి లేదు ॥ ఇదినిశ్చయమురా । వుండుంటె యీ యెరుకెతానొరా । యెరుకాయెరిగినవస్తు వెరుకాని తెలియుము । యెరుకా యెరుగదు బయలు నిట్టిదట్టిదియన । నిదినిశ్చయమురా । వుండుండుంటె యీ యెరుకెతానొరా ॥ * * * *

౬౫. రవితమసమున్న దెరుగునె । ప్రవిమలవావాగ్ని చదలు బట్టు శెరుగునా । దినమును రాతిరి రాత్రిని దివమెరుగునె । లేమి లక్ష్మిదేవి యెరుగునా । అన్నమును భూదేవి యెరుగూనా । భవ నాశస్థితులు రాపాడేటి యెరుకాకాను । భవనాశస్థితిలేని బయలల్లె రుగదు । లక్ష్మిదేవి యెరుగూనా। అన్నమునుభూదేవియెరుగూనా॥

౬౬. లేనికల గలిగినప్పుడు । దానికి దశదిశలయందు తగ మొదటకొనక । తానంటున్న మేల్కను । లేనిక లేచూచనేని। లేకాపోవుగదా । కలతోమేల్క లేకపోదుగదా!। లేనెరుక బయలు

లీలీలాగ నీకెపుడు । గానవచ్చి తెబోధ । గావాలెననవపుడు । లేక పోపుగదా । కలతో మేల్కు లేకపోదుగదా ॥ *

౬౭. చచ్చుట పుట్టుట మేలుకవచ్చుట । గాఢాసుషుప్తి వచ్చుట । లీసాల్గచ్చముగ సహజ మెరుకకు । పొచ్చము । యీ యెరుకనిల్వ । బోదుమాయప్పా । అచలము కిట్లు లేదుగదప్పా । మచ్చికతో రెంటీ మర్మము నీకిప్ప । డెచ్చాగ దెల్పితీ నెరుగు । మెరుకనిల్వ బోదూమాయప్పా । అచలముకిట్లు లేదుగదప్పా ॥

౬౮. తలయెత్తి జూడజాలునె । అలచీకటి యెదుటనిల్చి । యజ్ఞాత్తుకర్ణ । కలవచ్చి మేల్కయందున గలచేష్టలు । మోల నిల్చి కనుగొనగలదా । అట్లనెయెరుక కనుగొనగలదా । యిలలో సద్గురుబోధ నెరిగీన నరుని । చేష్టలుగంటె నుళ్ళక్కి । సద్గురు బోదాట । కనుగొనగలదా । అట్లనెయెరుక కనుగొనగలదా ॥

౬౯. యెరుగదు సుషుప్తిని జాగ్రతనిరవందసుషుప్తి । రెంటి నెరుగను మేల్క । ట్లరయగ బయలెరుకల రెంటెన్నెరులదు బయ । లెరుక రెంటన్నె నెరుగూచునుండూ । గురుముఖమూన నెరిగియీా రెండు । తిరమూగ యెరుకాను తీసివేసి తెచాలు । పరులూ నేననియేటి పలు కెలేకుండు । నిశ్లెరుగుచునుండూ । గురుముఖమూన నెరిగి యీా రెండూ ॥ * * * * * *

౭౦. యెరుకజడ మజడమీాజగ । మరయగ పరపూర్ణమేమి । యనరానిది । యీాయెరుక జగముల స్థిరములు । పరిపూర్ణము శాశ్వి తపుది పాటించికనరా । కావారెండీ పాటీవి వినరా । గురుముఖ మున వీత్నె నరుడు గుర్తెరుగునో । తిరిగిపుట్టడువాడీ ధరపై మును పటివలె । పాటించికనరా । కావారెండీ పాటీవివినరా ॥

౭౧. మరుపుకు తన్మాత్రలుగల । మెరుకకు తన్మాత్రలున్నయీా రెండొకటే । పరిపూర్ణమునకు లేవవి । పరిపూర్ణము యెరుకగాదు । మరుపుగాదోయి । వెతకినదీని సరిది లేదోయి । పరిపూర్ణమెరుకాల

పరిశోధించీ గ్రంథము । రచించినీకి స్తి । మరువాకచదు వెరుకమరువు గాదోయి । వెతకినదీని సరిదిలేదోయీ ॥ *

౨౨. సంకల్పాదిక గుణముల సంకుల । మీాయెకుకయందు సమకూడుండుఁ । సంకల్పాధిక గుణముల సంకుల । మచలమున జూడ జాడలేదన్నా । యీారెంటికి యీాడుగాదన్నా ॥ కొంకాక యీారెంట్ని గూర్చి గ్రంథముజేస్తి । సంకోచింపక జదువు । శంక బుట్టదు । శంక జాడలేదన్నా । యీారెంటికి యీాడుగాధన్నా ॥ *

—( బయలాకాశముల ఆరోపితతాదాత్మ్యము )—

౨౩. యెరుకైన భూతపంచక మెరుకకు । చరణములుకటియు హృదయము గళముఁ । శిరమును నయ్యాను క్రమమున । ధరణి మొదల్ జేసియిట్లు తనయాగు రైరుగు । గగనము బయలంచన రాదీమరుగూ। యెరుగకాకాశ మెపరిపూర్ణమనుచు । కొందరుపల్కిరిది విని గురిదప్పియుండేవు । తనయాగురైరుగు । గగనము బయలంచన రాదీమరుగు ॥ * * * * *

౨౪. యెరుక బయలందు లేమిని । యెరుకనుశూన్యంబటంచు యెఱుగించబడెఁ । యెరుగుమిదె ఆకసం । బిల్లెరిగితే యెరుకాక సములు । యేకామాగదరా । ఆకసము బయ లేకమెట్లవురా । పరి పూర్ణమిదుగొ కన్పడుశూన్యమనరాదు । యెరిగుండు మెదిరిస్తి । యికనాచైజూచేవు। యేకామాగదరా। ఆకసముబయలేకమెట్లవురా॥

౨౫. కనుపడెడి బయలులోపల । కనుగొనలేదయ్యో యరుక గావునశూన్యం బనవలశె। దీన్ని ఆకశ మనవలశెను । దీనవిశ్వ మాయనోయప్పా। యింతకువేరే మాయయేదప్పా । కనుకానె యీావిశ్వమును లేనిదనిలెస్స । వినజెప్పనాయెను ॥ కనబోకుండని పోని । మాయనోయప్పా । యింతకువేరె మాయయేదప్పా ॥

౨౬. ఆవరణము నాకసము । నిరావరణము నచలమనుచు । అనిరిమహాత్ముల్ । ఆవరణము మితిగలిగిన । దావరణము లేంది అమితమని తెల్సుకోరా । యీారెంట్ని వేరని కనుక్కోరా । ఆవర

ణమునసే నిరావరణమునుజూచి । యావరణః మెడలీన । ఆవల మాట । లేదని కనుక్కోరా । యీరెంట్ని వేరని కనుక్కోరా ॥

౭౭. బయలాకసమని కొందరు । భయపెట్టెద రందువలవ । భయపడకుసుమీ । బయలందు శబ్దమున్నను । బయలాకస మనుచు నమ్మ బడని నీచాతా । శబ్దములేదీ భ్రమయందు చాతా । బయలాకాశముగాదు పరిపూర్ణమనినమ్మి । నయమూగ యెరుకానునమ్మాక విడిచిపో । బడనినీచాతా । శబ్దములేదీ భ్రమయందుచాతా ॥

—( సృష్టివిదానము )—

౭౮. మేలుక సుషప్తిలోపల । యేలీలంతనకుదాను యేతెంచునో । గుర్తాలీల బయలులోపల । వాలాయము తనకుదానే వచ్చునోయన్నా । వొచ్చి హెచ్చి చచ్చునోయన్నా । యీలోపలనె బట్ట బయలున్న దెరిగితె । యీలోకమున నిల్వజాల । దెరుగకుంటె వొచ్చునోయన్నా । వచ్చిహెచ్చి చచ్చునోయన్నా ॥

౭౯. వినుమూర్ణనాభి । తాబుట్టినమీదట సృజనచేయు । దినముహరించుక । ఘనమగు పటశతకోట్లను । తనలోపలి దారమునను । తానట్టె జనును । అట్లనెయెరుక తాబుట్టికనునూ ॥ పనిబూని బ్రహ్మాండ బాండానంతములాను । క్షణములోపలద్రుంచి । కనరాక వేవేగ । తానట్టె చనునూ। అట్లనెయెరుక తాబుట్టికనునూ॥

౮౦. వినుమితరులు । యెరుకనూసాక్ష్యనిపల్కిరి। నేనుసాక్షినహామనినీతో । వినజెప్పితి । నింతియె వేరనకూడదు । రెంటినొక్కటని తెల్సుకోరా । మాటలభేద మనికనుక్కోరా। అనరాని వినరాని కనరాని బయలందు । తనకై తానరుదెంచి । తనకై తాజను । నీసాక్ష్యని తెల్సుకోరా । మాటలభేద మనికనుక్కోరా ॥

౮౧. చులుకన యుక్తిగ నొక్కటి । తెలిపెద విను । సందియంబు దీరును దీనక । పలుకున గలిగిన యర్థము । పలుకును విడనాడినిల్వ । బడు చోటెంకేది । రెండుగవొక్క పలుకె అయినాది । తెలియుమీలాగున తెలివి దేహములయ్యె । తెలివే తనువునుబాసి।

తెలివి స్థిరముగనిల్వ । బడుచోటింకేది । రెండుగవాక్కు పలుకే అయినాది ॥ * * * * *

చ౨. యెరుకైన భూతముల । నీవెరుగుము ఆకసముగాడ్పు । యింగలమును । నీళ్ళిరవంన నేలయని । నేనెరిగిన పద్ధతిని నీకు । నెరిగించినానూ । ముజ్జగములయ్యెను వీట్లతోను । పరిపూర్ణమందు కన్పడుచు । తమకుదామె । మరికానరావిట్టి । మార్గము కలవీటి । నెరిగించినాను । ముజ్జగములయ్యెను వీట్లతోను ॥ * *

చ3. యెరుకోత్పత్తిని తెలియగ । సరసిజ గర్భాదులైన చాలరనెటిచో । నరుడెంతవాడు ॥ చాడది యెరుగుదునన । వట్టి మాట లివి । వింతగాకా । తప్పదువాని కికరాకపోక । అరమరలేక సద్గురుమూర్తి చరణ । పంకరుహద్వయార్చాన । నెరుగాని నరు మాట । లివివింతగాకా । తప్పదువాని కికరాకపోకా ॥ *

చ౪. లేనెరుక । బయలు లోపల । తానెట్లు జనించెననిన తగవిను । వంద్యాసూనునిగతి । వియదబ్జ విధానంబున । యతు రాజాదా నీవిధమునన్ । రజ్జువు సర్పమైనా విధమునన్ । స్థాణుపురుషుని చందానమృగజల । శశవిషాణము స్వప్నానందముగ రాజాదా నీవిధమునన్ । రజ్జువుసర్పమైనా విధమునన్ ॥ * *

చ౫. లేనెరుకను యెరుకనియన । లేనెరుకెట్లాయననిన లెస్సగ వినుమా । లేని మృగజలము । వంద్యా సూనులుగలిగుండి వెదకి చూడా లేనట్లు । యీ లేనెరుక యాడాలేదిట్లు । స్థాణుపురుషుడు శశవిషాణము । గగన సూనాము । నరునీ స్వప్నానందమివి వెదకి । చూడాలేనట్లూ । యీలేనెరుక యాడలేదిట్లూ ॥

చ౬. యెరుకోద్భవ మెట్లన్నను । సరళంబగు నారికేళ । సలిలము భంగిన్ । యెరుకెట్ల పోవునన్నను । కరిమ్రింగిన వెలగపండూ కరణిగ నెరుగూ । తిరిగిరాని కరణింకో యెరుగు । పరిపూర్ణమున్నాది యెరుకాతానెరిగితె । యెరుకేమ్రగ్గును । భస్మాసురుడు మ్రగ్గిననాటి । కరణీగ నెరుగూ । తిరిగిరాని కరణింకో యెరుగూ ॥ *

౮౭. సంతోషాసంతోషము । లంతలోగనవచ్చి పిదప । నరుగునెచటికో । వింతైయున్నది చూచితె । యింతియెసుమియెరుక పుట్టు । నిక తెల్సుకోరా । సంశయమేలా యిదినమ్ముకోరా । యంతాని దెల్పాదు । యీదేవమార్గమందంతాట । బహువొన్నెలగుపడి యగుపడ । నిక దెల్సుకోరా । సంశయమేలా యిదినమ్ముకోరా ॥

౮౮. తోలుకారు మెరుపుకైవడి । పోలుపుగ నీళ్ళందు దోచు । బుగ్గల రీతిం । అలసూర్యకిరణమందున । గలనీళ్ళంబలెనె । యెరుక గనుపించునయ్యా । అంతలోయచట గనుపించదయ్యా । కలకాలమొకరీతి గలిగుండదీయెరుక । తిలకింప పవలురాతిరి దిరుగు విధమూన । గనిపించునయ్యా । అంతలోయచట గనిపించదయ్యా ॥

౮౯. కట్టెందు నిప్పులేకను । కట్టియ నొకసమయమందు గనుపడి । బహుగా । మిట్టిపడి । తుదకు గనుపడ । దట్టిదెసుమి యెరుకపుట్టు । మమల విచారా । తనకుతానె యరుడెంచెనోరా । పుట్టుగిట్టుటలానె నట్టేట నిలచుండి । బట్టబయలుపొడ గట్టిన గనుపాడ । దమలావిచారా । తనకుతాన యరుదెంచెనోరా ॥

౯౦. తనమూలము తలిదండ్రులు । తనవలెనె వారువారి తలిదండ్రులకుగ । తనవలెనెగాని । యన్యము గనజననస్థానమొకటి గలరానతరమా । బ్రహ్మాదులకది తెలియ తరమా । వినుము యీ బ్రహ్మాండ జననాము । నీ నాయందునన్నైన దిదియుగాదని । వేరే యింకోటి గలదాన తరమా । బ్రహ్మాదుల కదిదెలియ తరమా ॥

౯౧. ఆకాశము శూన్యంబని లోకులు మొరబెట్టి । దాని లోపవనాదుల్ । ప్రాకటముగ బుట్టినవని । చీకాకుగ జెప్పినారు । ఛీవినరాదూ । వంధ్యాసంతీ క్షితిలోన లేదూ । కాకుంటె వినుచోద్యమాకుం దేటికికొమ్మ । లీకాలమున నే మేమెకంటి మనుమాట । ఛీ వినరాదూ । వంద్యాసంతీ క్షితిలోన లేదూ ॥ * *

౯౨. అన్నపు సూక్ష్మాంశమును । సెన్నగ నీరంబు ప్రాణ । మెరుగుము । యీరెండెన్నడు కలియవో । నాడేసున్న సు

మీ యెరుకమాట । సుగుణసంపన్నా । కలసు కై యెరుక సుమియిం తకన్నా । వున్నా దెరుకమూల మన్నది వినలేదు । యెన్నాడు యీ భ్రాంతి నిన్నంటనివ్వాకు । సుగుణసంపన్నా । కలసు కై యెరుక సుమియింతకన్నా ॥ * * * * *

౯౩. సంకల్పములేనిదె । నిస్సంకల్పములోనదోచు । చను దోచుచనుగ । సంకల్పముతప్పన । నిస్సంకల్పము నెరిగెనేని । చను తాలేననుచూ । నిస్సంకల్పమును నిల్చేదనుచూ । సంకల్పించుట కింక సంకల్పమేది । నిస్సంకల్ప మందిట్లు సంకల్ప మెరిగితె । చను తాలేననుచూ । నిస్సంకల్ప మును నిలచేదనుచూ ॥ *

౯౪. మాయగదా । తేనియహం బాయగదా । తన్ను దానె యచలము యేర్పాటాయెగదా । మాయనలేందాయగదా । మాయచిత్రామాయగదోయి । సంశయమంత పాయగదోయీ । మాయాసమూలాము । మాయజూస్తుండంగ । మాయామైపాయాను । మాయాకె యిదిచిత్ర । మాయాగదోయీ । సంశయమంత పాయగదోయి ॥ * * * * *

౯౫. బిందువు తనువున బుట్టును । బిందువు తనువింద్రియ ముల బృందం । బసువుల్ అందముగగలుగునివి । దేనందున బుట్టె నవో తెలియ । నజునికితరమా । మూలములేనివని తెలుసుకోనుమా అందూకె బయలున్నా దరశి । మూలములేని బింద్వాదికంబూల । పేరుదల్వాకు । తెలియ నజునికి తరమా । మూలములేని వని తెల్సు కోనుమా ॥ * * * * * *

—( యెరుకను విడిచే విధానము )—

౯౬. వొక దేహదారి తనువున । సకలావస్థలు జనించి । చనిన విధమునగ । అకలంకమైన బయలులో । ప్రకటంబై లేని యెరుక । బయలుండజూచి । తనముచ్చాట పరికించిలేచీ । వొక కొంతసేపైన వుండేటందుకు లేక । సకలాము తనవెంట జను దేరజను । బట్టబయలుండజూచి ॥ తనముచ్చాట పరికించిలేచి ॥

౯౭. రాకడ పోకడ లేకను । యేకస్థితినుండునట్టి యీబయ లందుఁ । రాకడ పోకడగలిగి । యనేకముగా దోచు లేని యెరుక సుశీలా । ప్రతిమలో లేని పెరుమాళ్ళలీలా । లేక తోచినయెరుక లేనే లేదనుచు । నీకీకీలు గురునీచె యెరుకై తేజా । లుళ్ళక్కెరుకా నుశీలా । ప్రతిమల లేని పెరుమాళ్ళలీలా ॥ * *

౯౮. వనిగల్లు దకము లోపల । తనకై తావచ్చి । తనకు తానేగు విధంబున పరిపూర్ణము లోపల । తనకై తా నచ్చియెరుక । తనకై తాజనునూ । అచలంబున్నదని తానెరిగిననూ । తనలేమి నిజ మూని తనకేతోచును । తోచి తనకల్మి మృషగా । భావనజేసి నిలువాక । తనకై తాజనును । అచలంబున్నదని తా నెరిగిననూ ॥

౯౯. పరిపూర్ణములో దోచుచు । యెరుకేచను । తనకు దానె యేర్పడ వినుమీ । తొరటలు తొమ్మిదిగలదై । తరితీపుల నొందుచుండి । తనువానదగుచూ । అచలంబున్నదని తాలేననుచూ మరుగిళ్లెరుకకు దెలియ । యెరుకే నిల్వదుగాని । పరిపూర్ణముండు । దాన్నెరిగే దెట్లికగుర్తు । తనువాన దగుచూ ॥ అచలంబున్నదని తాలేననుచూ ॥ * * * * *

౧౦౦. అహమనదుగదా అచలము ॥ అహమున్నదో లేదో చూడ । దదినిజమెకదా । అహమును బుట్టించదుగద । అహముద యించేటివరకే । అదివున్నదిగదా । అహమెవిశ్వమై నిల్చిందిగదా అహమె యీముచ్చట్ల । నన్నింటెరుగునుగద ॥ అహమెతాలేనాని యరిగితె సరిగద । అదివున్నదిగదా । అహమెవిశ్వమైనిల్చిందిగదా ॥

౧౦౧. లేనెరుకను బయలందున । లేనే లేదనక । యిత్తరు లేలపలికిరో । లేనిది కలదని । పిదపను । లేనే లేదనుచు । సిగ్గూ లేక యీలీలా । ఛీవినకీ చీకాకు నీకేలా । మేనంద శుద్ధాముతానల్లు కొనిముళ్ళి । పూని కడిగినరీతి నొను సిగ్గొకయింత । లేకయీలీలా ఛీ వినకీ చీకాకునీకేలా ॥ * * * *

౧౦౨. పిల్లలు తాట్యాకులతో । పిల్లలగావించికొంట్ల పేరం

టంబుల్ । కొల్లలుగ జేయవారల । తల్లులుగని సత్యమనుచు । తలచేరా మదినీ । నినుసీవిట్లూ దలుచరామదినీ । కల్లా సంసారంబు । గనిమానవులుసంతసిల్లా । గురుమంత్రసిద్ధూలు నిజమాని । తలచేరామదినీ । నిను నీవిట్లు దలుచరామదినీ ॥ *

౧౦౩. మేనెరుకల రెండింటిలో । దానిని యిదిదీనినదియు। తగసృజియించుర ॥ మేనెరుకలివియుమూలము । లేనిదెసృజనయ్యె ననుచు । లేనెలేవంటీ । అంటె తప్పు లేనే లేదంటీ । మేనెరుకలిప్పూడు దేనందున్నవోచూచి । లేనిమేనెరుకల లేనివనుచూ నమ్మి । లేనెలేవంటీ । అంటెతప్పు లేనేలేదంటీ ॥ *

౧౦౪. యెరుకపని జేయదనకుము । యెరుగుట మరచుటలురెండు । యెవ్వరిపనులో । యెరిగింపుము నాౘ్రమోలను । వెరువను । తప్పితివిదెబ్బ వేసేనుచూడూ । అట్లనకుండ జేసేను నేడూ । వెరపించుటే దెబ్బ వేసెన నాతండ్రి । యెరిగించి పైమర్మ । మెరుకానునేటీసివేసేనుచూడు । అట్లనకుండ జేసేనునేడూ ॥

౧౦౫. యెరుకొక్కటుండె నేనియు । యెరుకే యీవిశ్వరూప । మేర్పడదాల్చెర । యెరుకొక్కటి లేకుండిన । యెరుకైన ప్రపంచమున్న । దెవరెరిగెరికనూ । లేదననైన నెవరుండేరికనూ । పరిపూర్ణమైనట్టి బయలుండ గనిపెట్టి । గురుని వాక్యముబట్టి । గురుతుబోగొట్టితె । యెవరెరిగెరికనూ । లేదననైన నెవరుండేరికనూ ॥ * * * * *

౧౦౬. తెలుపు మృదుత్వము మధురము । గలవస్తువ చక్కెరనుచు గనుగొన్నట్లా । తెలివి శరీర జగంబులు । గలవస్తువు బిందువనుచు । గనుగొనరాదా । నేదెల్పితె వినినమ్మరాదా । తెలివీషై బయలుండ దెలశి । యీ తెలిశిని । తెలివిచేత నెబట్టితేశి వెయ్యరపోసి । కనుగొనరాదా । నేదెల్పితె వినినమ్మరాదా ॥ *

౧౦౭. లేనెరుక బయలులోపల। తానైతన కేరుపడిన । తనమూలమునే । తానెరుగ దలచినప్పుడు । తానేలేకుండు । దృష్టాంత

మువినుమిచటా । కలదోచాదె తనకై తానెచట । తానైతోచిన కల । తనమేల్కగనబోతె । తానెతనకూలేదు । తగయున్నదీ దృష్టాంతము వినుమిచటా । కలదోచాదె తనకై తానెచటా ॥

౧౦౭. యెరుకను కలలో పురుషుని । కెరుకె యీవిశ్వమగుచు । యేర్పడు కలగా । యెరుక బయలుగని । తా లేందెరిగిన । నెరుకకదిమేల్క । యిదినమ్మిలెస్సా । యెరుకతోపొందు వదులాదె పిస్సా । యెరుకానె కలనీకు యెప్పుడు దోచీతె । యెరుకాలేందను మేల్క । నెరుగుమప్పుడెచాలు । యిదినమ్మిలెస్సా । యెరుకతో పొందు వదులాదె పిస్సా ॥ * * * *

౧౦౮. చిత్తరువు రంగుగోడల ॥ నెత్తెరగున దెలసినావో । నీవిప్పుడు । నీ చిత్తమున జెగము నెరుకను । వృత్తబయల్ నట్లదెలియు । మూహతోడుతనూ । తెలిశి విడువు మూహ జగములనూ । అత్తెరగునజేస్తె ఆవాలి మాటాను । యిత్తెరగని తెలియ । నెవరుండెరటుమీాద । మూహతోడుతనూ । తెలిశి విడువు । మూహ జగములనూ ॥ * * * * * *

౧౦౯. పరిపూర్ణములోలేనిదె । యరుకొక్కటి దోచితనను యరిగిన మృషగా । యరుకే విడుచున దెట్లన । కరములు తమ పనులుతాజె । గడుపునట్లుగనూ । యిదిగాకుంటె కలదింకోటివిను మరికానిధామాట మంచీది మాటాని । పరిపరివిధమూాల పలుకెపలు కులపని । గడుపూనట్లుగను । యిదిగాకుంటె కలదింకోటివిను ॥

౧౧౦. అంటదు కలమేల్కను । మేల్కంటదుకల నెన్నటికిని ॥ కడునిశ్చయ । మీారెంటికిరియగుర్తు బయలుల । రెంటిని రెండంటకుండు । రెండెరింటిలోను । కలయరుకాలీ రెండూామిథ్యేనూ । దంటాగ మేల్క బయలుంటా మెప్పటికెరిగి । గెంటూామపై రెంట । రెంటికల యెరుకాల । రెండెరింటిలోను ॥ కలయెరుకాలీ రెండూమిథ్యేను ॥ * * * * * *

౧౧౧. కలమేల్క లెరుక బయలుల । కిలసామ్యము జేసి

చూడు మీభ్రిమదొలగుం । పలమేమి పెక్కు చదువులవలనను । జపయాగయోగ వ్రతముల వలనన్ । శమదమ మఖశతమూల వలనన్ । తలక్రిందుగాబడ్డ తనువూనె గానన్న । కలమేల్కగని తానెక్కడనిల్వ నట్లవు । నెవ్రితములవలనన్ । శమదమమఖ శతమూల వలనన్ ॥ * * * * * *

౧౧౩. బలధనవిద్యా ధైర్యంబులు । చక్కదనంబు । సత్వ బుధ్యాద్యుతులం । కలలోయివి లేని మనుష్యుల । జగమును । తన నుతాను । జూచి మానవుడూ । మేల్కనెనేని చూడాలేదొకడు । కలమేల్కలెరుక బయలుల కట్లజతగూర్చి । కలయరుకలను । దేశి కులచె వీడితెజాలు । చూచి మానవుడు । మేల్కనెనేని చూడ లేడొకడా ॥ * * * * *

౧౧౪. వినుము నేననుచు యెరిగె । తనువందున లేక । బయలు తానిండినదా । కనుగొను మదికనుగొని । యీతనువును విడనాడుమింతె తడువేలనోయీ । యీపనికింక గడువేలనోయీ। అనుమానముంటె నీ వరయీము । శివరాములను దీక్షితులుజేసె । నచల గ్రంథమునంత । తడువేలనోయీ । యీపనికింక గడువేల నోయీ ॥ * * * * * *

౧౧౫. తిమిరారియందులేనిదె । తిమిరము తనుదానెవచ్చి । తేజోనిధియా । తిమిరారి యునికి గనుగొని । తిమిరము తాని లువనట్లు । తెలుసుకోరాదా । బయలెరుకాల తెలిసి యీమీదా భ్రమరూపమైనట్టి । బ్రహ్మాండ మెరుకాల । భ్రమదీసి వేసితే । భ్రాంతిబుట్టదు మళ్ళి తెలుసుకోరాదా । బయలెరుకాల దెలసి యీమీదా ॥ * * * * *

౧౧౬. మరుపన తొలిమేనులుమూ । డెరుకన నాలవశరీర । మీరొండొకటే । పరిపూర్ణ మవలి । దీవలి యెరుకను గురువాక్కు చేత । నెగరజిమ్మినను । ఘోవును । లేని దెరిగె దేగినను । యెరిగేదె లేకుండు । యేమొ ఆవలిజాడ । నెరిగెవారెవరింక। యింతె చాలెరుకాను । యెగరజిమ్మినను । పోవునులేని దెరిగ దేగినను ॥

—( మత నిరసన )—

౧౧౭. వన్నియ త్రైగోకచోటను । పన్నుగగలసినది। హృదయ పద్మంబనుచుక్ । యెన్నుదురు జనులు । యెరుకందున్నాదని। శృతులు బల్కు చున్నావినుమిా ' । తెలుసుకొ మోతుమన్నావినుమిా । వొన్నెలన్నియుమిారి వున్న వస్తువజాడ । నెన్న జెరుంగాక । యెన్నోరీతులఃబల్కు । చున్నావినుమిా । తెలుసుకొ మోతు మన్నావినుమిా ॥ * * * *

౧౧౮. మతముల వారలు । తమ సమ్మతమైనటువంటి । శాస్త్ర మర్యాదలచే । మితమేరు పరచుకొని । బహుగతులను కలహింతు । రట్టి గతినీకేమిటికి । చపలతజెందె స్థితినీకేమిటికి । ప్రతిలేని యీబట్ట బయలుండజూచి । సంతతము లేనెరుక । లేదని నమ్మ । మికవారి గతినీకేమిటికి । చపలతజెందె స్థితి నీకేమిటికి॥

౧౧౯. ద్వైతాద్వైత విశిష్టులు । సైతురు । వినిసైసతెపుడు । సైసకపిదపక్ । సైతురు క్రమమున వేరన । నాతత మతి జీవశివుల నవివినబోకూ । నేబోధించినది విడబోకూ । ఘాతమా బయలూను పొడజూచి గురునీచె । ద్వైతాద్వైతవిశిష్ట ద్వైతాములనుమాను । మవివినబోకూ । నేబోధించినదివిడబోకూ ॥

౧౨౦. కొందరు దశవిదనాదములందున । నభపంచకంబునందున । చక్రాలందున । లక్ష్యధ్యానంబందున । హంసందుబుద్ధి నాటింతురోయీ । యోగములందు నటియింతురోయీ । అంది సిద్ధులచాత నానందింతురుకొంద । రందారి మనుసీ బోధందె నీవుండూము । నాటింతురోయీ । యోగములందు నటియింతురోయీ ॥

౧౨౧. కొందరుముద్రలుగనవలె నందురు । మరికొందరధికమందురుద్రష్టక్ । కొందరు భజనె లెస్సనియందురు । యివియున్నియెరుకేనని తెలుసుకొనుమిా । నీకివియేాల పనిలేదు వినుమిా । ముందూగ పరిపూర్ణ మున్నాదిగని । గుర్తు నెందుండకుండ। దాన్నె

గరగొట్టితే జాలు । నని తెల్సుకోనుమీ । నీకివియాల పని లేదు వినుమీ । * * * * * *

౧౨౨. పంచాదశక్షరముల । ప్రపంచము తానుద్భవించె । ప్రణవాక్షరమం । దంచుశృతు లెన్నె । దాన్నెరుకంచని నీవెరిగి । యెరుగు మచలాము దీనట । నిల్పుకుమెరుక నచలాము లోనట । చంచాల మతిచాత । చతురాక్షరైక్యావం చెంచెద వెందుకు । యిదినమ్మ కెరుగుమీ । యచలాము దీనం । నిల్పుకుమెరుక నచలాములోనట ॥ * * * * *

౧౨౩. కొందరుభూతములై దిటియందున । చిత్తంబునుంతు రధికములనుచునట ॥ కొందరు యేమియు లేదనియుందురు । గుర్తెరుగుమిన్ని యపశబ్దములెరా । యివినిలువాని నని తెలియవలెరా । యెందరెన్నన్నా నీకెంకూకు బయలూను । ముందూగ గనిగుర్తు । నెందుండ నివకవ్వి । యపశబ్దములెరా । యివి నిలువానివని తెలియవలెరా ॥ * * * * * *

౧౨౪. కొందరు కర్మమునే బాగందురు । మరికొందరెక్కువందురుతనువునట । కొందరు ప్రాణములధికము లందురునీకిట్టి । వట్టి యాశాలేమిటికీ ॥ వారితోపొందు జేసెవేమిటికీ; యెందారిమాటాల నెన్నినయీబోధ ॥ కిందీవెకాని । పైకెక్కేవి గావిట్టి । యాశా లేమిటికీ । వారితోపొందు జేశేవేమిటికి ॥ * *

౧౨౫. కన్నుల ప్రక్కల ప్రేళ్ళిడి । తిన్నగభ్రూమధ్యమందు దృష్టినిలిపి । యందున్నది వెన్నెలలో బయలన్నా । కనుమందు రెరుకె అది నిలువాదోయీ। తనువుతో బోయ్యేదని దెలియుమోయీ యన్ని తనువులువచ్చి । యరిగీన ఝణకాళ । వున్నాబయలదిజూచి వుళ్ళకెక్కరుకనుమాను । మదినిలువాదోయీ । తనువుతోబోయ్యే దని తెలియుమోయీ ॥ * * * *

౧౨౬. జనులాత్మానుభవంబైనను । ముక్త్యనిబల్కి । రిట్లు నమ్మకు । మెరుకె । కనరాదెచ్చట గురుకృప । ననుభవ మెవ్వారికి

పైన ఆమాటనిజమో । అనుభవముళ్ళ క్కీమాట నిజమో । విన జెప్పుమీరెండూ వివరించిపైమాట ।। వినినే ముందరిబోధవినిపింతు వేవేగ । ఆమాట నిజమో । అనుభవముళ్ళక్కీమాట నిజమో ॥

౧౨౭. తననుతాగనిన । మోక్షుంబని పల్కిరిగాని జనులు అదినమ్మకమీ । తననుతా బట్టబైటను । గనబోయితె । తనకు దానె । కానరాదోయీ । విశ్వము తనకు కానరాదోయీ ॥ తన నుంచైనది గనుక । తాను విశ్వమురెండు । గనుపించుటుళ్ళక్కీ । గావునతనకుదా గానరాదోయీ । విశ్వముతనకు గానరాదోయీ ॥

—( యెరుక పరిణామము బయలు గుర్తెరుగునా)—

౧౨౮. విత్తేచెట్టైపుట్టును ॥ విత్తే విత్తనమురీతి వెలయును ధరపై । విత్తుకు చెట్టుకువేరే ॥ విత్తనమొకటున్నదనిన । విన గూడదోయీ ॥ తనకుదాబుట్టునువినవోయీ । విత్తూచెట్టులరెంటి విధమూ భూమెరుగా॥ నట్లుత్తాబయలెరుగాదు। సత్తూచిత్తూలరెంట్ని వినగూడదోయీ । తనకుదాబుట్టును వినవోయీ ॥ *

౧౨౯. చెట్టే మూలము విత్తుకు । చెట్టుకుమూలంబువిత్తు। క్షితిపైరెండుం ॥ పుట్టిన చచ్చిన రెంటిని । గట్టిగతా నెరుగకుండు। గదరాయీనేలా । నీవీరీతి గనుగొనవేలా । పుట్టూచు గిట్టూచు పొలుపొందు తనువెరుక । లిట్టివిచిత్రాము। లెన్నడెరుగదుబయలు గదరాయీనేలా । నీవీరీతి గనుగొనవేలా ॥ * *

—( పరిపూర్ణబోధ )—

౧౩౦. భాగవతుల నారాయణ యోగికి । జానకియనేటి । యువిదామణికిꣳ । బాగుగపుత్రుడనై । భూభాగమునꣳ కృష్ణ ననుచు । ప్రభవించినాను । అనంతికి ప్రభువునైనానూ । నాగురువు కృపచేత । నయమైన యీబోధనేగంటి । కన్నంత నీకుదెల్పుటకిట్లు ప్రభవించినాను । అనంతికి ప్రభువూనైనానూ ॥ *

౧౩౧. యెరుక తనకు దావిడిపో । దెరుకను విడిపించలేరు

యెవ్వరుధాత్రిన్ । గురుడొకండుదప్ప । గురునకు పరిచర్య యొనర్చి బోధ పద్ధాతివినిన్ । తిరిగిరాని పద్ధాతిగనిన్ । పరిపూర్ణ మెరుక యేర్పరుచ నెరుకలేక । హరిని స్వప్నముగన్న । కరిమ్రగ్గినట్లవు । యీపద్ధతి వినిన్ । తిరిగిరాని పద్ధాతిగనిన్ ॥ * *

౧౩౨. నేనెవ్వడననుజీవుడు । నేనేనేనను శివుడు । యీ రెండనకన్ । తానుండునచల । మివిటెని । నేనెరిగరిగనను । పైది నేనెట్లనినీ । నేననకున్న తానెట్లనీనీ । నేనన్నదాంట్లోదె నీ నా ప్రసంగాము । తానన్నదాంట్లోనె తలపోయవలెనిట్లు । నేనెట్లనినీ। నేననకున్న తానెట్లనీనీ ॥ * * * *

౧౩౩. తొర్రలు తొమ్మిదిగల । మేన్మ్రరికి । యొకరెంటి లోన । మర్రలునాల్గుం । డెర్రది తెల్లది నల్లది । కర్రెదిదానగ్ర మందు । గలదొక్కతూటు । అదియెరుకానె । పులుగుండుచోటు । కుర్రాగురుబోదానె । గొడ్డాలిచేబూని । మర్రిపులుగుల రెంట్ని । మలచికొట్టరపోని । కలదొక్కతూటు । అదియెరుకానె। పులుగుండె చోటు ॥ * * * * * *

౧౩౪. తనువుతొ వొచ్చిన యెరుకె । తనువునుతనువనుచు తననుతానని యెరుగన్ । తనువును బాసిన మీదట । తననా దేహమును రెంట్ని । తానెరుగదపుడూ । అదిగనుక తాలేనేలేదె పుడూ । అనుమానరహిత । మిందచలమున్నదికంటె । తనమాట తలపోయ తనకె సిగ్గె । తనను తానెరుగదపుడూ । అదిగనుక తా । లేనెలేదెపుడూ ॥ * * * * *

౧౩౫. ఉప్పెనచే జెడుతెరు । వొకప్పుడు విత్తనముబుచ్చు । నా రెంటికియీ తిప్పలుదప్పవు ధరయే తిప్పలుతా నెరుగదిట్లూ । తెలుసుగదోయీ । తను వెరుకా బయలులనల్లెరుగోయీ। గొప్పెన గురుబోధ చొప్పన నెరిగి । యీతిప్పాలు గలవాట్ని । తప్పాదీశి తె చాలు ॥ తెలుసుగదోయీ । తను వెరుకా బయలులనల్లెరుగోయీ॥

౧౩౬. లేనియహామున్న బయలును। లేని ప్రపంచమునుతనను

లెస్సగ తనలోతాను విమర్శించిన । యాలేనివి లేకుండు । నవల లేదు యేమాటా । యిట్లనన్నైన లేదుయేమాటా । లేనియహా మీాబైట । లేనేలేదిరిజూచి । లేనిది కలదాని లేనిమాటాడేవు । లేదు యేమాటా ॥ యిట్లవన్నైన లేదుయేమాటా ॥ *

౧౩౭. పరిపూర్ణ మెరుకలెట్టివో । గురుముఖమున । రెంట్ని లెస్స గురు తెరిగెరుకగ । సరిపుచ్చుకొన్న మృషయని ॥ పరిశుద్ధపు బోధయీాది । పాటించికనరా । శివరామూలపద్ధతియిదెరా। నరులు కొందరుబల్కి రెరుకానుభ్రమింగి । యీాపరిపూర్ణ మయ్యేమం చెరు గాక చెడుటాకై పాటించికనరా ॥ శివరాములా పద్ధతి యిదెరా ॥

౧౩౮. జనులనిరి దేవుడెవరికి కనరాడని । నామరూపకర్మ జననముల్ । గననతనికిలేవని । యీాజనవాక్యము । బయలుకెపుడు। సహజమా వినరా । అనుమానాము చాలించికనరా । కనినామ రూపాదికములున్న యెరుకాను । వినబోక కనబోక । విడచిపెట్టర పోని । సహజమా వినరా । అనుమానాము చాలించికనరా ॥

౧౩౯. అంతట గలదీయెరుకని । యెంతో వాదింపుచుందు రేరుగనివారల్ । అంతట నింతట గనుపడు । నంతటిదె కానియె రుక । అంతాట గలదా । అదినిజమైతే యగుపడవలదా । అంతట గలదొక్క అచలామెకా । నెరుక నంతాట గలదాని । యనరాదు వినరాదు । అంతట గలదా । అదినిజమైతే । యగుపడవలదా ॥

౧౪౦. తనువో బహిరింద్రియములో । మనసో ప్రాణములో విషయమమతో । నేనంచని నీవని యననిదియని । యనుమానిం చెదవదేల । అదిత్రోవగాదూ । నీవెన్నాడు యిదివినలేదూ। విను మీా పరిపూర్ణాము గనిలేని యీామీాది । తనువాదికమును । లేందని గురునిచే దెలియు । మదిత్రోవగాదు । నీవెన్నాడు యిదివినలేదూ॥

౧౪౧. నినునను ప్రపంచమును జగమనియెరిగేయెరుకచాత । నచలమును గనుంగొని ॥ నినునను జగమును । జగమనియెరిగె యెరుకమాను । మమలావివేకా । చాలూ నీవిక్రమమెరిగినాన్కా ।

నినునన్ను। పైరెండింటినివిశ్వమనక। బయలనకుండెదున్నాదం। చన గుర్తు లేకుండు ॥ మమలావివేకా । చాలూ నీవీక్రమమెరిగినాన్యా॥

౧౪౨. గురుడు పరిపూర్ణమునుజూ। పెరుకను లేందనుచు దెల్పి ॥ యికదల్చకుమంచెరిగించక । విడిపోవునె యెరుక । నరుల్ సాధనములు యెన్ని జేసిననూ ॥ లక్ష్యముద్ర లెన్ని జూచిననూ । హరహరి బ్రహ్మమరాసుర ముఖులైన । ధరణీసురాద్యష్ట । దశజాత్యుద్భవులాను । యెన్ని జేసిననూ ॥ లక్ష్యముద్ర లెన్ని జూచిననూ॥

౧౪౩. యీావృత్త బట్టబయలును । నీవిప్పుడు వుండజూచి । నిజముగ యెరుకగ । నీవని నేనని జగమని భావింపుము । విదపదీన్ని బాయూమనిశముగ । నిజముగదీన్ని బాయకనిశముగ । శ్రీవనితేశ రాజీవసంభవభవ । దేవేంద్రాదులనింక సేవించు తలుపేల । పాయూ మనిశముగ । నిజముగదీన్ని బాయనికశముగ ॥ * *

౧౪౪. పరిపూర్ణమనిన యెట్టిదో యెగిగెదనని యెరుకబైటికేగిన । యెరుకే । యెరుకకు శూన్యంబయ్యెను । యెరుకనుజన్మించినట్టి । యీావిశ్వమంతా । యెరుకవలెనె యేమిలేదంతా ॥ యెరుకా వుండంగానె యెరుకవిశ్వములులే । వెరుకాకె యిదిజూడ। యెంతో వింతైతోచె । యీావిశ్వమంతా । యరుకవలెనె యేమిలేదంతా ॥

౧౪౫. దేహాకారము గానిది । యాహంబావంబులేని । దఖిల జనులుదా । సోహంసోహంబనినను । మోహము జెందనిది బైలు । మొదలెరుగవలెరా ॥ యెరిగినయెరుక తుదకరుగవలెరా। కోహం కస్త్వంబాని । కూతాలు గూసేటి । దేహి దేహములాను తెలియూని యీాబైలు । మోదలెరుగవలెరా । యెరిగిన యెరుక తుదకరుగవలెరా ॥ * * * * *

౧౪౬. యేవస్తువచాతను । తానావిర్భవమొందుదే । హా మనుతరువరయగ । ఆవస్తువె దానికి విత్తైవెలయును। దాన్నె సాక్షి దృష్టానికనుమీా । యెరుకయిదె స్వప్నము వినుమీా । భావించి చూడుమీా । బట్టబయలనుభూమి , యావిత్తు చెట్టున్న దరయాద

విత్తూనే । ద్రష్టాని కనుమీ । యెరుకయిదె స్వష్టాము వినుమీ ॥

౧౪౭. యేపరిపూర్ణము మేనికి । లోపల వెలినిండియుండు ॥ లోపములేక । ఆపరిపూర్ణమె జగతికి । లోపల వెలినుండుదాని॥ లోనెవున్నవిరా । పైరెండెవ్వి లేనివెన్నకురా । యీపూర్ణబోధచె । పైప్రపంచశరీర । రూపాము లెడబాపు । మీపట్లనె । దాని లోనె వున్నవిరా । పైరెండెవ్వి లేనివెన్నకురా ॥

౧౪౮. యెరుకనగా యెరిగేటిది । మరుపనగా యెరుకతనను మరుచుట । మీరెంట్నెరుగనిదే బయలివి । నీవెరిగెరుకను । మరుపునిప్పు డెరుకాచె విడరా । వీడితెపైమాటెరిగెదెవ్వడురా। యెరుకె పరిపూర్ణమం । చెదిరించివదిరేపు । పరిపూర్ణమైతే । చూపర బయలందునదాన్ని । యెరుకాచె విడరా । వీడితే పైమాటెరిగె దెవ్వడురా ॥ * * * * *

౧౪౯. లేదన్నను కనుపడుగద । నేదెలిసితి ననినబైట । నేనిల్వగదా । నేదీని వెనకగద । నాకేదోమూలంబు యిదిగా । దిక లేదెచ్చోటా ॥ కనుకనె వుళ్ళుక్కినే నన్మాటా ॥ యేదిలేదిదిదప్ప నేదెలియనిధియని । తా దెలుసుకొని యెరుకె తనను వీడితేజాలు । యిక లేదెచ్చోట । కనుకనె వుళ్ళుక్కినే నన్మాటా ॥ *

౧౫౦. సత్యమగు బట్టయలు । నసత్యంబగు యెరుకనెరిగి । సద్గురు కృపచే । సత్యముగాదని యెరుకను । సత్యముగా నమ్మి వుంటె । చాలుచాలన్నా । వానితోటి సాటెవ్వరెన్నా । నిత్య నిత్యములానె నిర్ణాయ మెరుగాక । నిత్యుడై యుండేటి నిజబోధ గలిగితె । చాలుచాలన్నా । వానితోటి సాటెవ్వరెన్నా ॥

౧౫౧. పరిపూర్ణములోదోచిన । యెరుకేకలలేని యెరుక నెరిగిమృషని । యీమరుగెరుకకెరుకదెల్పిన । యెరుగుటయే మేల్కసుమీన్మా । యిదియామారకుమీ । సద్గురువాజ్ఞ కెదిరి మీరకుమీ। యెరుకాయీతీగ । యెగిరిపోయిన వెనుక । పరిపూర్ణమొకటుండు । పలుకారాదెట్లందు । నిదియామారకుమీ । సద్గురువాజ్ఞ కెదిరి మీరకుమీ ॥ * * *

౧౫౨. తిప్పలగు రాకపోకల। నెప్పుడు తానెరుగనట్టి। యీబయలందుఁ। తప్పక తనకై తానే। తప్పున గనవచ్చియెరుక తాగానరాదూ। బయలున్నాది తనకెరుక లేదూ। యెప్పుడుబయ లున్న దెరిగితాలేనట్టి। చొప్పు సద్గురుబోధ। చొప్పున దెలిసితె। తాగానరాదూ। బయలున్నాది తనకెరుక లేదూ॥ *

౧౫౩. అన్నము శుక్లంబగు। రసమున్నతిగా రక్తమగును॥ నొకచోరెండుఁ। పన్నుగ గలసిన మేనవి। యెన్నబడుఁయెరుక గల్గి। యిదెమాయసుమ్మీ। మూలములేని దిదెనీవు నమ్మీ। యున్నావు పరిపూర్ణ మున్నాదిగని। లేనిదెన్నడు లేదానియెరిగితె చాలు। గుర్తిదెమాయసుమ్మీ। మూలములేనిదిదెనీవునమ్మీ॥

౧౫౪. పెనుమాయను జూడుమయిదె। జనకుని జఠరంబు వలన। జననీ గర్భంబునజొచ్చి। మారురూపున జనియించును। నవయవములు। జనితామై భువినీ। వినుకనుతిను మూర్కొను వచ్చునుచనీ। దినదినమభివృద్ధా దీనిచే బయలును। గనియా మాయలమల్లి కథ। మాయించుముపోని। జనితామై భువినీ। విను కను తిను మూర్కొను వచ్చునుచనీ॥ * * *

౧౫౫. పెట్టియ లోపలి గారెడి। చెట్టుపయిఁ గానవచ్చి। చెట్టున జూడఁ। గట్టుపయి దోచునిది। కనకట్టుసుమీదీనివలెనే గమపించునెరుకా। అంతలో యెచట। గనుపించదెరుకా। దిట్టవా బోధాచే పట్టీ। యెరుకనుతిరిగి। పుట్టాకుండగదాని। పుట్టీ ముంచుములేందే। గనుపించునెరుకా। అంతలొయెచట। గనుపించదెరుకా॥ * * * * * *

౧౫౬. నేనని బ్రహ్మలోపల। లేనిదె సంభవమునొంది। లీలతనకుదా। మేనుజగమ్మై వెలసెను। నేనదిమృగ జలమురీతి। నిజముగాదనుచూ। లోకులనేటి। గజిబిజి వినుచూ। మానాస మున వారి మాటకామోదించి। దానికిబోధకు దగునంచువినజేస్తి నిజముగాదనుచూ। లోకులనేటీ। గజిబిజి వినుచూ॥ *

౧౫౭. గుడమే మధురము మధురమె । గుడమాగుడ మధురము గొనకొని తోలుతగా । బొడమిన దే దనసరిగా । బొడమింద్రాకతేగ । రెండూ పోయినట్టె కదరా । తనువెరుకాలి । లైనట్టె కదరా । పొడజూచి బయలు నివ్వడె మేనెరుకలజోలి । విడరా లేనివెరెండు । పెడచొప్పెట్టకవిను । పోయినట్టెగదరా । తనువెరుక లిల్లైనట్టెగదరా ॥ * * * * *

౧౫౮. ఇదివున్నది యిదివున్నది । యిదివున్నది యనుచు బయలు నెరిగి యెరుకచే । యిదిలేనిది యిదిలేనిది । యిదిలేనిది యనుచునెరుక । నెరిగితె సరిరా । ఆపైనుండె దెట్లందువినరా । వుదయాస్తమానాము లుడుగాక యిదినీనె । మ్మదిలోననమ్మి నా మాట నిశ్చయమిట్లు । యెరిగితె సరిరా ॥ ఆపైనుండె దెట్లందు వినరా ॥ * * * * * *

౧౫౯. యెరుకే చదువుల జేసును । యెరుకేవిను చదువు నెరుక నెరుకే తిరమం । చెరిగించును శంకించును । యెరుకేకొన కేమిలేక । యేగునోయన్నా । బయలేచదువు । యెరుగాదోయన్నా యెరుకే యెన్నటికైన పరిపూర్ణమున్నదం । చెరిగితాలేనాని యెరిగి తెనిలువాక । యేగునోయన్నా । బయలేచదువు । యెరుగాదో యన్నా ॥ * * * * * *

౧౬౦. చూపులలోగల వస్తువు । చూపులగను వస్తువులును చూపులు గూడక । తేపకు యెరుకని తెలియుము చూపులు । లేనట్టిబయలు । చూచెదింకేమీ । యెరుకేలేదు ॥ తోచెదింకేమీ దీపామువలె కనుపాపలో గనువస్తువె । పరమాత్మని చూపితె యెరుకాయ । చూచెదింకేమీ । యెరుకేలేదు । తోచెదింకేమీ ॥

౧౬౧. శతపత్రాప్తుని పొడగని । యతిరయమున తిమిర మణగి । యగుపడదెట్ల । ట్లతులిత గురుకృపగలిగిన । మతిమంతుల జూచియెరుక । మరినిల్వబోదూ । సంశయమునీ । మదినిల్వ రాదూ । శృతులందు స్మృతులందు । యితిహాసములయందు ।

సతతాము శ్రమపడి వెతకీనయీా । యెరుక । మరినిల్వబోదూ । సంశయమునీ । మదినిల్వరాదూ ॥ * * *

౧౬౨. లేనికల దోచినప్పుడు । లేని విచిత్రంబులవ్ని లేకనె తోచుగా । లేనికల మేలుకొన్నను । లేనివిచిత్రములుతాను లేకా పోవుగదా । అనుమానాము । లేదిందు వినరా । లేనెరుక యీరీతి గానె బయలునుజూస్తె । తానుతనచిత్రములు । పూనెందు నిల చుండ । లేకాపోవుగదా । అనుమానాము । లేదిందు వినరా ॥

౧౬౩ మరణ సుషుప్తుల జెందిన । పురుషుడు మేల్కనిన వాడు భువితదితరుడో । పురుషుడు కలగనువాడని । యెరిగుండుము మొదటియతె డెరుగాడీరెంట్నీ । రెండోపురుషు డెరుగూ నీరెంట్నీ । యెరుపూరొక్కటెనుమ్మితిరిగిపుడుదురుపీరె। గురునీచె మేల్కొంటె తిరిగి పుట్టనెపుట్ట । డెరుగాడీరెంట్నీ । రెండోపురుషు । డెరుగు నీరెంట్నీ ॥ * * * * * *

౧౬౪. యెరుకే యెరుకకు కొడుకులు । యెరుకే తలిదండ్రియెరుక । కెరుకే యితరుల్ । యెరుకే యెరుకకు మూలము । యెరుకకు మూలంబు బయలం । చెట్లందునోయీా । యెరుకేయెరుక కేమి లేదోయీా । యెరుక లేనివృత్త పరిపూర్ణమునుజూచి । యెరుకె తాలేనాని । యెగిరిపోయితెప్పె । మాటెట్లందునోయీా । యెరుకే యెరుక । కేమీలేదోయీా ॥ * * * *

౧౬౫. నినునీవు నన్ను నేనును । వమునీవునే నిమ్న యెరిగి నదెకల । యిదితా తననెరుగని దానినిగని । తనకలిమి వృపను చు దెలిసి । తానేగనేనీ । అదిమేల్కవలి । దాన్నెవ్వడెరిగినీ । నీనునీవునే నిన్నుబోధ । వినుపించూా వినుమాని । యనుటా కిద్ద రిక్షుడు । మునుపున్న యెరుకేది । తానేగనేసి । అదిమేల్కవలి । దాన్నెవ్వడెరిగినీ ॥ * * * * *

౧౬౬. నానావిధావయవములు । నానావిధ నామరూప నట నలు మాయల్ । నానావిధాలు ప్రాణాలు । నేనను యెరుకతె

యున్ని । నిబిడామైయుండూ । బయలుగ ననుతా। నిలువలేకుండూ నేను మేనీరెండు నేనె నేలేకుంటె । మేనులేదిదిలేక నేలిలిచె దెట్లన్ని । నిబిడామైయుండూ । బయలును గనతా । నిలువాలే కుండూ ॥ * * * *

౧౬౭. పరిపూర్ణ మనెటి పల్కే । యెరుకను బల్పాతుర ముల కెచ్చటగనినర్ । తిరమై యున్నది కనుగొని । యెరుకను బల్పాతురముల । నికగట్టిపెట్టూ । యెవరికి దెలియ । దిదిమూల గుట్టూ । గురుమూర్తి కరుణాచె యెరిగి తెల్పితినేనీ । పరిపూర్ణ బోధాను । పరులు జెప్పినబోధ । నికగట్టిపెట్టూ । యెవరికిదెలియ దిదిమూలగుట్టూ ॥ * * * * *

౧౬౮. చూపించ జూపరానిది । చూపించితి దాన్నివుండా। జూచినవుగదా । చూపించ జూచెనిదిదీ । న్నై(ప్రొద్దిక దల్చబోకు । మిదెగురుబోధా । నిన్నంటాదు నితరమేబాధా । నాపాప నాకూన నాచిన్ని నాయన్నా । నాపెన్నిధానామా నారత్నములకొండ ॥ యిదెగురుబోధా । నిన్నంటాదు నితరమేబాధా ॥ *

౧౬౯. నామము రూపమునటన । స్తోమము బయలందు లేదు చూడుమునీవా । నామము రూపము నటన । స్తోమము యెరుకందుగలదు చూడూమినిజమూ । బయలెరుకాలా । చూచిచూడ కుమూ । వేమారునేనెంత వినజెప్పినాగాని । యీమార్గమెతప్ప । యికలేదు రెండోది । చూడుమీ నిజమూ । బయలెరుకాల । చూచిచూడకుమూ ॥ * * * * *

౧౭౦. గురుడు గురుబోధ శిష్యుని । కెరిగించెటినేళ్ళ శిష్యు డెరిగెటివేళ్ళన్ । యిరువురు వైశ్వానర క । ర్పురములవలె వెలిగి యవల । పోడజూపరోయీ అట్లనెని । విక్కడ దెలియుమోయీ । పరిపూర్ణమెరుకాల నెరిగి । యామీదాట । యెరుకాను విడ చూలె । గురుబోధంచెరుగూము । పోడజూపరోయీ । అట్లనె నీవిక్కడ దెలియుమోయీ ॥ * * * *

౧౭౧. సతికౌంగిట తత్పతి త । త్పతి కౌంగిట సతియుజేరి ।

పవళించికలఁ । మృతిజెంది మేలుకనిసు । స్థితుౖలె యొక రోకరికట్టి చేష్టా దెల్పుదురా । శిగ్గెడలి యా । చేష్టానిల్పుదురా । ప్రతిలేని గురుబోధ స్థితి జెంద్యట్లనె సం । తతతిరిగి లేనెరుక ॥ గతియిట్టిదని దాని । చేష్ట దెల్పుదురా । శిగ్గెడలి యా । చేష్టనిల్పుదురా ॥

౧౭౨. పరిపూర్ణమెరుకలవియని । గురువరుడెరిగించి యెరుక కూటమి మాన్పఁ ! గురువుకు గురు । వెవరనుటకు మరిశిష్యునికింక నోటా । మాటావెళ్ళినా । పోయినయెరుక మళ్ళిమళ్ళినా । గురు శిష్యులనియేటి గురుతెన్నడెరుగాక । నిరతాము వకరీతి నిలచున్న బయలందు ॥ మాటావెళ్ళినా । పోయిన యెరుక మళ్ళిమళ్ళినా ॥

౧౭౩. అందముగా సద్గ్రంథము । చందము వినిపింతుదాన్ని । చదివిన వినినఁ । ముందుగ బయలెరుకై యే । సందునలేనెరుకలేక। జనవలెసుమ్మో । అదెయిది । విని చదువునమ్మో । యెందుకు నీకింక । యితరశాస్త్రముల జో । లందుగుర్తుండి పోదదిగాన । యీ యెరుక జననలెసుమ్మొ । అదెయిది విని చదుమీ నమ్మో ॥ *

౧౭౪. అలభద్రాచల మనినబ । యలుగా గుర్తెరుగవలయు। యెరుకను విఘ్నం । దులదోచి గురుని కృపచే । నిలువక విఘ్నగిరి పోతె । నిశ్చయమదెరా । కృష్ణదాసు । నిశ్చయమదెరా । యిల మీద యెవ్వరైన యీకందార్థఁముల । లోపలి గూఢార్థము దెలియ భ్రమను జెందరువారు । నిశ్చయమదెరా । కృష్ణదాసు నిశ్చయ మిదెరా ॥ * * * * * *

౧౭౫. బరులు నేననక నిండిన దెరిగింపుమదేమొ । బయలు । యేనొపలనుచుఁ యెరుగునీవెవరు। యీలె నెరుకను। వున్నావు। వుంటె యిదిలేనంచనుకో । నేనొ । నినునీ మదినీ లేననుకో । యెరిగి యీలె నెరుక యిట్లాలేకుండితె పరిపూర్ణమొ । దాన్నె పగిది గుర్తెరిగేము । యిదిలేనంచనుకో । నేనొనినునీ । మదిని లేననుకో ॥ * * * * * *

—( హితోపదేశము )—

౧౭౬. మానవుడు చేయబూనిన । దానినిలో తెరిగి ॥ చేయ

దగునని మదిలో । నేనెరిగి నీకు జెప్పితి । పూనుమురుచి బుట్టదేని
పోనినీమనుసూ । రుచిబుట్టీతె । పూను నీమనుసూ । నేనేమీా
యనబోతె నీకేమి దోచూనో । లేనినిష్టూరము లేకుండుటే లెస్స ।
పోనినీమనుసూ । రుచిబుట్టీతె । పూనునీమనుసూ ॥ *

౧౭౭. హరికర నఖముఖ విదళిత। కరిమ_స్తక గళితమైన । ఘన
మా_క్తికముల్ ॥ దొరికిన నెరుకలు గురిజలె । ధరియింతురు రెంటి
విలువా । తమరెరుగక నెకా ॥ అట్లనెబోధ । క్రమమెరుగ కనెకా ।
పరిపూర్ణ బోధాను నెరిగింపుచుండిన । యెరుకాకె । కొందరు మరి
గెరీమార్గాము । తమరెరుగక నెకా । అట్లనెబోధక్రమమెరుగక నెకా॥

౧౭౮. ప్రొద్దున నిద్దుర మేల్కొని । వద్దికి యేతెంచిగురుని ।
వక్రజనితమా । సుద్దులు మ్రొక్కి వినుము యే । ప్రొద్దిదిబహు ముద్దు
సుమ్మి । పుట్టీనందులకూ । గురుచరణాము । పట్టీనందులకూ ।
నిద్రావమా భ_క్తిచే । నీవిట్లూ । జేసీతె । దిద్దితీరిచిబోధ తెరువూ
జూపునునీవు । పుట్టీనందులకూ । గురుచరణాము । పట్టీనందులకూ ॥

౧౭౯. నామాట లెస్సవినుమా । సామాన్యంబనుచు
జూడ జనదిబోధక । ప్రేమాతిశయమునగని । వేమారిది గురుని
నోట । వినవలెసుమ్మీా । నిత్యము చదువు । కొనవాలెనమ్మీా ।
నామరూపక్రియ నటనలు గలిగీన । దేమివస్తువోదాన్ని । యెటు
నిల్వనివ్వాదు । వినవాలెసుమ్మీా। నిత్యముచదువుకొనవాలెనమ్మీా ॥

౧౮౦. అన్నము దిన్ననుఆకలి । తిన్నగనీరంబుద్రావ తృష్ణ
యురోగం । బెన్నగ నౌషధసేవను । జన్నకి)యంయెరుకనిల్వ జాల
దోయన్నా । యీాబోధనీ । చెవులాతో విన్నా । కన్నూలతో
జూచి కడముట్ట జదివీన । నిన్నెన్నటికి యెదుట నిలచుండి కను
గొన । జాలదో యన్నా । యీాబోధనీ చెవులతో విన్నా ॥ *

౧౮౧. జనన మరణప్రవాహాము । నణచునుయీాబోధపట్టు
డని సాధువులిచ్చిన । నొల్లకుండివారలు । జనినపుడాబోధమీాద ।
జనియించిప్రేమా । వెడకెదరట్టె । జనచేష్టలేమా । యనితోచి నీకు

నేవినజెప్ప వలసె । నీవునుయీబోధను వల్లననకు దొరుకదుమళ్ళి । జనియించి ప్రేమా । వెదకెదరట్టి । జనచేష్టలేమా ॥ *

౧౮౨. చక్కెర మెక్కక లోకులు । చక్కెర మాధుర్య మెరుగ । జాలరటువలెన్ । మక్కువతోవిని చదువక । చక్కగ గ్రంథార్థ మెరుగ । జాలేర జనులూ। కావుననీవు। చాలించిపనులూ చొక్కమీ గ్రంథాము చూడూమి కొనవేళ్ళ । యిక్కాడితో జన్మా మెత్తావు సరి । తెలియుజాలేర జనులూ । కావుననీవు ॥ చాలించిపనులూ ॥ * * * * *

౧౮౩. గూఢార్థ మెరిగి సతతా । రూఢుండై నతను గ్రం । ధరుచిగొనడుభువిన్ । గాఢతరజ్ఞానంబున । మూఢుండైయున్న వాడు మొదటికె వినడూ ॥ సుజనుల పొడ ముదమొప్పగనడూ । వాడు వీడనరాని వాడెగ్రంధమువినె॥ వాడు నిశ్చయమిట్టి । వార్తలెరుగని వాడు । మొదటికె వినడూ । సుజనులపొడ । ముదమొప్పగనడూ ॥

౧౮౪. తాబేటి తలపుచేతను । తాబేల్పిల్లల క్షుదార్తి । తలగుట తెలియుట । తాబేటి గర్భమందున ॥ తాబేలై పుట్టకున్న తరమా యితరులకూ । సద్గురుబోధ । ల్లరయనితరులకూ । యేబాధ లెరుగాని యీబోధ గలవారి ॥ చేబోధ బడయాక చేకోన దలచీతె తరమా యితరులకూ । సద్గురుబోధ ల్లరయ నితరులకూ ॥ *

౧౮౫. ఈతాపేక్షను మనుజులు ॥ నూతిదరిం జేరినిల్చి నోటగొలిగినన్ । యీతేల వచ్చువారికి । చేతులతో నీళ్ళమీాద । చేరీ యీాదకనూ । మునునేర్చిన । వారీదించకనూ । యీతీరుగనె దేశికేంద్రుడు దెల్పాక । చాతుర్యమునబోధ సాధించనయ్యాన చేరీయీాదకనూ । మునునేర్చిన । వారిదించకనూ ॥

౧౮౬. ప్రవిమల చిత్తుడు శిష్యుడు । సవినయముగ దేశికు పకు శరణాగతుడై । త్రివిద ప్రపాదములగొని భవనాశస్థితులు లేని పద్ధాతి వినినన్ । తిరిగిరాని పద్ధాతి గనినన్ । భువిలొ వానిసాటి బోల్ప నెవ్వరు లేరు । అవిరాళ భక్తినీ వారీతి నుండేవీ పద్ధాతి విని

నర్ । తిరిగిరాని పద్ధాతి గనినర్ ॥     *     *     *

౧౮౭. ఉపనయముగానిదె తా । నుపనయనము మీాది చదువు । నూహను గొనినర్ । విపరీత మగును దానను । చపలుడు బ్రాహ్మణుడుగాడు । చర్చించిచూడా । శూద్రుడువాని యర్చించ రేడా । ఉపమూచే బోధట్ల ఊహించి నిక్కేటి కపటా చిత్తుషు సాదు గణముతో సమమౌనె । చర్చించి చూడా । శూద్రుడువాన్ని యర్చించరేడా ॥     *     *     *     *

౧౮౮. మంత్రముచే సంతెట్లగు । తంత్రము లేకున్న కాదు । తంత్రము చేతర్ । మంత్రము లేకను వడుగిల । మంత్రము తంత్రంబు రెండు । మరిగూడుకోనీ । కార్యములన్ని జరిగించుపూనీ । మంత్రతంత్రములాలో మర్మము గురుడెరుగ । మంత్రతంత్రములాలో మరుగెరుగు గురునీచే । మరిగూడుకోనీ । కార్యములన్ని జరిగించుపూనీ ॥     *     *     *     *     *     *

౧౮౯. సకల జనుల సమ్మతిగా । నోక్కరైనను నడువలేరు నుర్వీస్థలిపై । మకరాంక జనని జనకా । ద్యకలంకులలోను నేనీవననేమి గణనా । బోధందితర । జనులేమి గణనా । వికలామానసుడవై వెతనొంద బోకు నీవకుటిల భక్తుడవని । తెల్పితీ బోధ । ననేమి గణనా । బోదందితర జనులేమిగణనా ॥     *     *

౧౯౦. బలదన విద్యలు దుష్టుల । కిలగలిగిన నోరుల నొంతురీర్ష్యమునర్ । బలదన విద్యలు శిష్టుల కిలగలిగిన నోరులబ్రోతు । రెంతో మోదమునా । నీవిరెంట నెరిగి మోదమునా । కలలోననైన దుష్టుల చెంతజేరాకు మెలమి శిష్టులచెంత కలనైన వదలాకు యెంతో మోదమునా । నీవిరెంటి నెరిగి మోదమునా ॥     *

౧౯౧. అందమగు స్వాతివర్షపు । బిందువు లెందెందు బడునో పృధివినిత । ద్బిందువులు పాదివశమున । జెందునుతగు నామరూప చేష్టాదికమునూ । అట్లనె నీవు । జెందె విన్నియునూ । మందితో జతగూడి మాట్లాడినంతలో । అందూకె సహవాస మత

యూము తగుదాన్ని చేష్టాదికమునూ । అట్లనేనీవు । జెందె విన్ని యునూ ॥ * * * * * *

౧౯౨. జారులకు లోకులందరు । జారులవలె తోచబడుట సహజ గుణంబౌ । చోరులకు సకల జనములు । చోరకులని మదికి । దోచు చునికి సహజమురా । అట్లనె । దుష్టాత్మునికి సహజమురా । పారాము లేని సం । సారాబ్ధి దాటించు వారిని తమవంటి వారిగ గనుటట్టి । వునికి సహజమురా । అట్లనె దుష్టాత్మునికి సహజ మురా ॥ * * * * * *

౧౯౩. గురుడు నరుడనుచు దలచిన । గురు మంత్రము మర చియున్న గురుపుత్రుల నా । దరణ యొనర్చక యుండిన । గురువును విడనాడి రెండో । గురుని జేరిననూ । సద్గురుబోధ । నెరిగి దూరి ననూ । యెరుక మహాత్యము యెరిగిన యిటువంటి । నరునాకు దప్పాదు నరకాము నిజమింకో । గురుని జేరిననూ । సద్గురు బోధ । నెరిగి దూరిననూ ॥ * * * * *

౧౯౪. మలయాద్రి చెంత చెంచుల । కిల చందన । భూరు హాము లె యింధనమట మి । క్కిలి గలుగబట్టి యట్లనె । చులుకన సుమి యింటగలుగు । సూరిభూషణుడూ । బహు మాన్యుడూ ॥ దూరస్తుడెపుడూ । తెలియాని వారికి తెలిసేది కఠినాము తెలివీచె దెలసీతె తెలియా జేసును బోధ । సూరిభూషణుడూ । జహు మా న్యాడు । దూరస్తు డెపుడూ ॥ * * * *

౧౯౫. చూచిమది దెలసి శిష్యుని । యాశయమును తగిన బోధ నతనికి దెలియగ । జేసి ముదమంద జేసెటి । దేశికుడే ముఖ్యు డనుచూ । తెలుసుకో వోయీ । కనియత గాణ్ని । కలుసుకో వోయీ । చేసి నీదయతో సీయాశ సంపూర్తిట్లు । వ్రాసైతె వేసుకో చూచేవు తార్కాణ । తెలుసుకో వోయీ । కనియత గాణ్ని । కలుసుకో వోయీ ॥ * * * *

౧౯౬. తనభార్య రూపు రేఖలు । తనపుత్రుల సద్గుణములు తన సంపదయుగ । తనపెరటి మందుచెట్టులు । తనగ్రామపు సాదు

జనులు । తనకు మెప్పొనా । యీ యిలలో యెం । తటి వారికై
నా । వినలేదె సీవాహల్యను జూచిమోహించె । ఘనవాహనుండు
చక్కని భార్యగలిగుండి । తనకు మెప్పొనా । యీ యిలలో యెం ।
తటి వారికైనా ॥ * * * * *

౧౯౮. విననేర్చి చెప్పనేర్చిన । మనుజులకే దీనిలోని మర్మ
ముదెలసుగా । వినజెప్ప నేరకుండిన । మనుజులు యీబోధలోని ।
మర్మామెరిగేరా । దీనందుండే । ధర్మామెరిగేరా । జనులె కొబ్బ
రికాయ తిననేర్పు గలవారు । తిననేర్చ్చన్నా కోతి । తనకా కాయ
బ్బిన । మర్మామెరిగేరా । దీనందుండె । దర్మ మెరిగేరా ॥ *

౧౯౮. నేనెంత లెస్స జదివిన । దీనిని దెలియుంగ గలరె
దేశిక వర్యుగా । పూనిసేవించ కుండిన । మానవులది యెట్లనన్నా
మరి వినవోయీ । నామాటందు । మనుసుంచ వోయీ । వాన
కాలములోని వర్షాము వాకబిందు । వైన మిట్టను నిల్వ । దది నిశ్చ
యమెకద । మరివినవోయీ । నామాటందు మనుసుంచవోయీ॥ *

౧౯౯. రతికొరకు గాదె సతిపతి । కతిహితముతి సేవజేయు
నటువలె బోధ । స్థితినీకు కుదురుటకు । సమ్మతితో గురుసేవ జేయు
మా । నీతివంతా । అభిమానాము । పోని నీదంతా । అతనీకి
దయవస్తె ఆరనిమిషమున బోధ । స్థితినీకు కుదిరించు సిగ్గు । విడచి
కొల్వుమా । నీతివంతా । అభిమానాము పోని నీదంతా ॥ *

౨౦౦. పెత్తనమున యేనుంగిల । చెత్తను దినవలసె చీమ
చిన్నతనమునే । హత్తుకొని తినును చక్కెర । యిత్తరి యీరెం
ట్లొనీకు । యిష్టమేదైతె । చేకొనుమదె । స్వష్టామిదైతే । పెత్తన
మున చేటె పెంపొందు చుండగాను । చిత్తాములో దెలియ । చిన్న
తనమెమేలు । యిష్టమేదైతే । చేకొనుమదె । స్వష్టమిదైతే ॥ *

౨౦౧. ఇవి వినుమని నను సుజనులు । చెవియొగ్గద రివియు
సృష్టుజేసి కృతికిబల్ । చవిబుట్టింతు రదెట్లన । శివుడు కళానిధిని
చక్క । జేసెనలేదా । నీమదిశంకా । బాసేనలేదా । అవనీలో
శ్రీరాముడవగుణి నాహల్య । నెవరేమియన । కుండ । సవరించి

సుగుణీగ । జేసేన లేదా । నీమది శంకా । బాసేనలేదా ॥ *

౨౦౨. పుట్టింట బిడ్డ బహుగా । దిట్టైయుండినను యెవరు । దిట్టరు భువిలో । పుట్టింటి వారుకోడలు । దిట్టైనను అత్తవారు । దిట్టేరు సుమ్మీ । చేతులకొద్ది । కొట్టేరు సుమ్మీ । అట్టుంబలెనె బహు దిట్టైన శిష్యుని । తిట్టాడు గురుమూర్తి । వట్టివారుజూపై తిట్టేరు సుమ్మీ । చేతుల కొద్ది । గొట్టేరు సుమ్మీ ॥ *

౨౦౩. అందముగ ఘనులు మెచ్చెద । రెందుకు మెచ్చెదరు దీన్ని యితర జనంబుల్ । చందురుడుదయమందిన । సింధువు చెలరేగినట్లు । చెలగూనె చలూ । కోనేలూ నూ । తులు భావులేలూ । మందయానల పొందు మగవానె నుతిజేతు । రెందూకు నుతిజేతురిల పండపురుషూలు । చెలగూనెచలూ । కోనేలూ నూ । తులు భావులేలూ ॥ * *

౨౦౪. కాకంబులు సంపూర్ణ । తటాకస్థ జలంబు లెట్లు తాగక తృషచే । గైకొనునో కుంభజలమ । ట్లీ కలయుగమందు । దుష్టులింపుమీరగనూ । విల్వారుబోధ । కంపూబారిననూ । మీకు దీనికె లంకె మాకేలయిట్టి । చికాకు కొక్కొకమైతె గైకొందు మందూరు । యింపుమీరగనూ । నిల్వారుబోధ । కంపు బారి న నూ ॥ * * * * * *

౨౦౫. కుచ్ఛితమతి యగు పురుషుని । చెచ్చెర వినుమనుచు జదువ శిష్టులవలె తా । ముచ్చట పాటుగ వినడివి । కుచ్చుల కుళ్లా యికుక్క । కూనకెందుకురా । పిడుదుకు దుగ్ధ । పానమెందుకురా । హెచ్చైన ముత్యాలు పచ్చాల పతకాము । గృచ్ఛి పేరుగ జేసి తెచ్చి వేశితె కోతి । కూన కెందుకురా పిడుదుకు దుగ్ధపానమెం దు కు రా ॥ * * * * * *

౨౦౬. అక్షయబోధస్థితిగల లక్షణవేత్తలకు మెప్పులైన కృతులలో । కక్షకు తప్పులు కుమతి । పరీక్షింపుచునుండునెన్నో ।

రీతూలవినుమీా । తద్భావమీా । రీతీదికనుమీా । మక్షికమెప్పుడు మానిసుగంధాదు లీక్షించు వ్రణము ప్రీత్యతుమెకద । యెన్నో రీతుల వినుమీా । తద్భావమీారీతిగనుమీా ॥ * *

౨౦౭. రమ్మని పిలువనిదే । పద్యమ్ములు । జదువంగవచ్చి యతినిందించుర్ । సమ్మతిగాక కుమతివిని । యిమ్మహిమది యెట్ల నన్న । నిట్లానెవినుమీా । వానిబుధ్యాదట్లానె కనుమీా । బొమ్మలాటలాడిచ్చు బొమ్మలతానొకటిచీ । పామ్మానియనినాహాస్యమెమ్మనర్చదెపోక నిట్లానె వినుమీా । వానిబుధ్యా దట్లానెకనుమీా ॥

౨౦౮. వటియించిన చన్నులుగల । కుటిలాలకి నిందజేయు గుత్తపురవికెర్ । యెటువలె తనతప్పెరుగక । నటువలె గ్రంథమును మెచ్చ । డతిదుర్జనుండూ । లేనిదెతప్పు । వెతుకుచూనుండూ । యిటువంటిబోధనే నెరిగెదెట్లనుకోక । కటువాక్యములు బల్కిఘనుల గాసిలజేయు । నతిదుర్జనుండూ । లేనిదెతప్పు వెతుకూమనుండూ ॥

—( గురుకృప )—

౨౦౯. అపరోక్షుమానె మనుజుల । కుపరోక్షుంబైనబయిలు గురుకృ లేకర్ । అపరోక్షుమాను మనుజుల । కుపరోక్షుంబైన బయలు గురుకృపగలుగా । కీలిదెలేని । యెరుకాతా తోలుగా । విపరీతమాబుద్ధి విడిచి నీవెప్పూడు । ఉపచారములుచేయు చుండూము గురునీకి । గురుకృపగలుగా । కీలిదెలేని యెరుకతా తోలుగా ॥

౨౧౦. యెరుగననేటిది యెరుకె । యెరుగుదునని తనను పరుల నెరిగేదెరుకే । యెరుగ నెరుంగుదు ననుదా । న్నెరుగుచు నుండేటిదెరుకే । నిరుపామబుద్ధీ । నీవెరుగిదీ నిగమప్రసిద్ధీ । గురుమంత్రమనియేటి గృద్దాలి తోటయీా । యెరుకాకూకుడు వేరు। నెరిగి త్రవ్వితెచాలు । నిరుపామబుద్ధీ । నీవెరుగిది । నిగమప్రసిద్ధీ ॥ *

౨౧౧. ఎరుకేకోశమ్ములైదెరు। గెరుకేభూతముల నెరుగు నెరుగును సర్వం । బెరుకే యెరుక నెరుంగును । యెరుకను గుర్తెరుగ వేరె । యెరుకవున్నాదా । వున్నదంటే । నరకామెకాదా । నిరతాము

గురుసేవ పరతంత్రులగుచు । తత్కరుణాకు పాత్రులై । యెరుకమాలినవారి కెరుకావున్నాదా । వున్నదంటె । నరకామెకాదా ॥

౨౧౨. గురుమంత్రముచే నిలువని । యెరుకను పరిపూర్ణమనుచు నెరిగినిరతముగా । యెరుకై యుండినవారల । తెరువికనీకేల వట్టి డిజోలిమానూ । యెరుకలేని । యాజోలిబూనూ । గురునిచే పరిపూర్ణ మరసియీ తెలసీన । యెరుక నెన్నటికినీ వెరుగాకు మిది వట్టి । డిజోలి మానూ । యెరుకలేని యాజోలిబూనూ ॥ *

౨౧౩. గురుతను కలలోనారి । నరులూరికెవచ్చిపొంది నయముగ సుతులం వరకన్నియలను గాంచియు । గురువరుచే మేలుకొంటె । గురుతుండదన్నా । ఆపైమాట । నెరిగదేదన్నా । యెరుకొక్కటుంటెనే యేర్పాటులుండూను । యెరుకొక్కటేగితే యేర్పాటు జేసేటి । గురుతుండదన్నా । ఆపైమాట నెరిగదేదన్నా ॥

౨౧౪. నినునను నివుకలగాంతువు । నినునను కలలోన గాంతు । నేనొకవేళ్ళగా । నినునను నివు నేననునిను । గనుగొన గాగలమె । మేలు కనినామీదటనూ । గురుబోధట్లా । వినినమీదటనూ । మునుపూ గలిగినయెరుక మొదటికె నిలువాదు। నినునన్ను నేనన్ను నినునీవెరుగుటమెట్లు । కనినామీదటనూ । గురుబోధట్ల వినినమీదటనూ ॥ * * * * *

౨౧౫. లేదులేదనుచు యెందరు । వాదించిన లేకపోదు పరిపూర్ణముదా । పోదుపోదనుచు నిల్పిన । పోదని యనుకోకు। యెరుక పోనెపోచుందీ । గట్టిగలేచి । పోనెపోచుందీ । వాదభేదములేనివారిచెయెరుకాది । పాదూపెకిలించేటి పద్ధాతి నెరిగితే । పోనెపోచుందీ గట్టిగలేచి । పోనెపోచుందీ ॥ * * * *

౨౧౬. మేనెరుకల రెంట్లోనొక । దానిని యెడబాసిచేయ తరమాపనులగా । మెనికి యెరుకవు గావున । మేనన యెరుకెరుక యనిన । మేనాని యెరుగూ । యీరెంచ్చి । నివు నేనాని యెరుగూ యెరిగి వీట్లతోబయలు నెరిగి మేనెరుకాల । తిరిగిచూడకుచూ స్తె

గురుని పాదములాన । మేనాని యెరుకగూ । యీరెంట్ని । నీవు నే
నాని యెరుగూ ॥ * * * * *

౨౧౭. మరుపు సుషుప్తియు మూర్ఛయు । మరణంబుసమా
దియనుచు మానవులెరుకన్ । దొరిగిన నారునిశరీరము । నెరిగెద
రానరుడు । మేను నెరుగాదోయన్నా । తననైనతా । నెరుగడో
యన్నా । యెరుకుండితేయేమి తిరిగిపుట్టుచునుండు । తిరిగి పుట్టడు
వాడె । గురుబోధ గలిగితే । యెరుగడోయన్నా । తననైనతా
నెరుగడోయన్నా ॥ * * * * *

౨౧౮. పరిపూర్ణమెరుకలివియని । యెరుగని బయలందులేని
యెరుకతనకుదా । నరుదెంచిట గురుశిష్యుల । తెరగునమాట్లాడి
రెంట్ని । దెలసితాజనునూ । ఆపైమాటూ । పలికెదేదికనూ । అర
మరలేకనే నెరించినట్టియీ । గురుబోధ పాత్రూల నెరుగాక తెలి
పేవు । తెలిసితాజనునూ । ఆపైమాట । పలికెదేదికనూ ॥ *

౨౧౯. స్థిరమగు పరిపూర్ణమున । స్థిరమగు యీ యెరుక
నెరుక దెలియు జగములన్ । యెరిగిన దెరుకేకద స । ద్గురుకృపచే
యెరుకబోతే । గురుశిష్యులేరీ । నోరెత్తాక । మరివినరోరీ । గురుని
పాదములాన గురుతు లేనటువంటి । పరిపూర్ణ మొకటుండు పలుక
రాదట్లుంటె । గురుశిష్యులేరీ । నోరెత్తాక । మరివినరోరీ । *

—[ గురునిర్ణయము )—

౨౨౦. బయలెరుకలు శిష్యునకున్ । దయతో గురు డెరుక
జేసి తరువాతనుసం । దియమేమి లేకయెరుకన్ । నయమున విడిషిం
చుగురుడూ । నయశాలిగాదా । నీమదికేది । నాటెనలేదా । భయ
భక్తి । గురుసార్వ భౌమూనిసేవ । నిశ్చయమూగ జేసితే జయ
మందెదవు గురుడు । నయశాలిగాదా । నీమదికిది నాటెనలేదా ॥

౨౨౧. పదిరెండక్షరములుగల సదమల మంత్రార్థమెరిగి ।
సద్గురుకృపచే । పదియారక్షరములుగల । యదియెట్టిదో తెలిశెనేని
యతడె సద్గురుడూ । యివి రెండెరుగ । నతడేడిగురుడూ । మొదటి

దిపరిపూర్ణమును దెల్ప నెరుకాను । తదనంతరవుది బోధనుజేయు నివిదెలిసి । నతడే సద్గురుడూ । యివిరెండెరుగ । నతడేడి గురుడూ॥

౨౨౨. పరిపూర్ణ మిదుగోయిదుగో । యెరుకను చూపించి లేని । యెరుకను లేదం । చెరిగించిన గురుడేసరి । యెరుకను నిల్పేటి గురుడు । యెందుకోయన్నా । తద్బోధ నీకెందుకోయన్నా । శర ణన్నవారి మస్తకమందుచైబెట్టి । తిరముగ యెరుకానుతీసివెయ్యని వాడు । యెందుకోయన్నా । తద్బోధ నీకెందుకోయన్నా ॥ *

౨౨౩. యెరుకభ్రమగల్గు శిష్యుని । పరితాపము మాన్పినట్టి పండితుడెతడో । గురుడతడే కాని గురువులె । గురువులమని । పొట్ట కొరకు । గాలిగెవారెల్లా । వారికీబోధ । తెలియూటకల్లా । పరిపూ ర్ణమును లేని యెరుక నేర్పడదెల్పి । యెరుకాను విడిపించ నెరుగాక । గురువులై । గాలిగెవారెల్లా । వారికీబోధ । తెలియుట కల్లా ॥

## —( శుశ్రూష విధానము. )—

౨౨౪. గురుశుశ్రూష నొనర్చుట । నెరిగించెద నెట్లననినయే ర్పడ వినుమా । నరులిష్టదైవములకుగా । పరిచర్య యొనర్చునట్లు । భక్తితోడుతనూ । గురుమూర్తిక । త్యక్తితోడుతనూ । నిరతా మరమర లేక నీవు సల్పితివేని । గురుబోధమరుగు । సద్గురునీ । చెదె లిసేవు । భక్తితోడుతనూ ॥ గురుమూర్తిక । త్యక్తితోడుతనూ ॥

## —( గురుమంత్రనిర్ణయము )—

౨౨౫. మరుపుసుషుప్తి మరణముల్ । వరిపూర్ణంబునకుసాటి పరచి యెరుకకుగా । మరియాది మేలుకపుట్టువు । నిరుదెరగుల నెరిగి యెరుక । నెగరజిమ్మొయీ । ఆపైనుండె । దెరిగెదెట్లోయీ । గురుమంత్రమిదెసుమ్మి మరువాక యేపొద్దు । స్మరణజేసితివేని । తిరిగిపుట్టువునీవీ । లెగరజిమ్మొయీ । ఆపైనుండె దెరిగెడెట్లోయీ॥

౨౨౬. ఆమంత్రయుగము దెల్పెద । నేమముతో దలుపు ముత్త దీబట్టబయల్ । యేమీ లేదని పలికిన । యీమంత్రమె ద్వా దశాతు । రింకోటీ వినుమీ । యెప్పుడునోట యివి మరువకనుమీ

యీ మూలములేని గుర్తెరిగె శరీరాము । యేమిలేదనియంటె । యిదెషోడశాతూరి। యింకోటి వినుమీ। యెప్పుడునోట యిదిమరువకనుమీ ॥ * * * * * *

—( గురుమంత్రార్థము )—

౨౨౭. తొలుమంత్ర పర్థమెక్కడ । కలదోయని వెదుకనేల కలదంతటయా । వలిమంత్ర పర్థమెక్కడ । కలదోయని చూడనేల । కాదాచూచేదీ । వినేది యనేది తినేది । అలతొలుతదాన్ని నీవవలోకనముజేసి । కలకాల మెరుకాలు గలదాన్ని విడువెరుక । గాదా చూచేదీ । వినేదీ యనేది తినేదీ ॥ * *

—( గురుమంత్రజపము. )—

౨౨౮. రానిది పోనిది బయలని ॥ లేనిది యీయెరుక యనుచు లెస్సగ దృఢమా । దానుక నీవీమంత్రము । మానక జపియింపుచుండు । మానీతిశాలీ । లేనిదిలేదు । మరువాక్జోలీ। లేనిది లేదాని పూని నిశ్చయమైతే। తానొక్కటుండును గాని యెట్లన విను । మానీతిశాలీ । లేనిదిలేదు । మరువాక్జోలీ ॥

—( మంత్రరహిత నిర్ణయము. )—

౨౨౯. ఇదిదప్ప యేమిలేదని । మొదటిది మొరబెట్టుచుండు ముదమునవినుమా। యిదియేమిలేదు పొమ్మని। వదలక రెండోది లెస్స । వదరూచుండునురా । బయలెరుకాల నిదినిశ్చయమురా । అదిగాననీ రెంటి నరసి నీవిప్పూడు । విదితాముగా రెంట్ని । విడరా మంత్రములిట్లు । వదరూచుండునురా । బయలెరుకాల । యిదినిశ్చయమురా ॥ * * * * *

—( బోధ మననవిధానము. )—

౨౩౦. ఉన్నది పరిపూర్ణములేం । దెన్నటికీ యెరుకయనుచు నిదిదృఢమాదా । కెన్నుము నేబోధించిన । తిన్నని యీబోధ । శిష్య తిలకా మరువకుమీ । సుజనులమ్రోల । పలుకావెరువకుమీ।

నిన్ను కుమతులు వచ్చి నీలో తడిగి తెవారికెన్ని । విధములనీ । వెరి
గింప కిదిశిష్య తిలకా మరువకుమీ । సుజనులప్రోల । పలుకా
వెరువకుమీ ॥ * * * * *

—( పలనిర్ణయము )—

౨౩౧. పరిపూర్ణ బోధ నెరిగిన । గురువరుచే బోధగొన్న ।
గొప్పఫలంబా । పరిపూర్ణ బోధనెరుగని । గురువరుచే బోధగొన్న ।
గొప్పఫలమానా । అదియట్లన్న కూడి రతిలోనా । పురుషూని
చేసంతు పోలతి బడయును బడయ । తరమానవారికె । తమవంటి
వారిచె । గొప్పఫలమానా । అదియెట్లన్న । కూడిరతిలోనా ॥ *

—( పూర్ణ గురువుయొక్క అవసరము )—

౨౩౨. పరిపూర్ణ బోధనెరుగని । గురుశిష్యులు బోధకొరకు
కోరపనిబడుగ । గురువర్యునొకని మరలను । హరువరమున బుట్టి
నట్టి యాశిఖండికినీ । భార్యైనట్టి । యబల డంద్రికినీ । వారుల
నిద్దరిని దేవలేనీ । యల్లుడు నేను । వరియింతుమని చెప్ప । వనిత
నంపినయట్ల । యాశిఖండికినీ । భార్యైనట్టి । యబలాతంద్రికినీ ॥

—( గురుకృపా విశేషము. )—

౨౩౩. గురుమూర్తి కెదుర హంకృతి । దొరకొన్న నుదాంగ
త్రోవ ద్రొక్కిన చెవులగ । గురునింద వినిన జేసిన । నరునకు పరి
పూర్ణబోధ । నలవియె తెలియా । కూడదువాన్ని । తెలియాక
కలియా ॥ గురుడు దెల్పని పుస్తకరీతిచేపూర్ణ । మరసీతి మనియెం
తో మురసీన యీబోధ । నలవియె తెలియా । కూడదువాన్ని
తెలియాక కలియా ॥ * * * * *

౨౩౪. జనులందరు గురుబోధను । గనిరాజనులందు నేను గలి
యకయున్నగ । ననుమన్నింతురె వారని ॥ మనమున దలపోస్తె
బోధ మర్మామబ్బినా । అబ్బినవారి । ధర్మామబ్బినా । జనన మర
ణము లేని ఘనమైన త్రోవనే । గననైతి ననిబోధ గనకున్న యీ
బోధ । మర్మామబ్బినా । అబ్బినవారి । ధర్మామబ్బినా ॥ *

౨౩౫. మంతనమున గురుబోధను। యెంతో వింతనుచు నమ్మి తింతేకద। యేవింతలు గనరావనిభా। వంతము నొందేటి వాని। బ్రతుకెంతకంతే॥ చింతలులేని। గతిగానడింతే। అంత కంతకువాని కతిచాద స్తమెకాని। సంతకూటముతోటి సంభాషిం చడువాని। బ్రితుకెంతకంతే। చింతలులేని గతిగానడింతే॥ *

—( గురుకృపా విహీనుల అనధికారత్వము )—

౨౩౬. ఏవురుషుడు గురువర్యుని। శ్రీపాదము బట్టలేదో। సేలుగనాతం! డిపుస్తకమునుజూచిన। యేపట్టున నిలువకేగు। నిది నిజమయ్యా। నరులార మీా। మదిదెలియరయ్యా। యీాపరమ గోప్యాము యెవరెరుగరోయయ్య। నాపలుకు మదిలోన నాటీన వారికె॥ యిదినిజమయ్యా। నరులార। మీామదిదెలియరయ్యా॥

—( గురువాజ్ఞాను వర్తన )—

౨౩౭. పరిపూర్ణము నెరుకనునే। నెరిగించితి నీవురెంటి నెరి గితివిగదా। యెరుకను గురుదక్షిణగా। మరివేగిర మివ్వవట్టీ। మా టలేమిటికీ। యెరుకతోయింక। కూటమేమిటికి। పరులు నేనని యేటి భావమభావమై। నిరతాము వొకరీతి నిలచుండు మికవట్టి మాట లేమిటికీ। యెరుకతోయింక కూటనేమిటికి॥ * *

౨౩౮. నేమొదట నిన్నుగనుగొని। యేముక్కలు నీవు చెవులో నిమిడిస్తినో। నీవాముక్కల మూడింటిని। యేమాత్రము మరువకుండ। యీాబోధని స్తీ। అంతకెయింత। గాబోధజేస్తి। ప్రేమతోజదువు మిదేమార కెప్పుడు। కామితార్థమునిచ్చు। పోమీా యింటికి। దీపించీబోధని స్తీ। అంతకెయింత। గాబోధజేస్తి॥ *

౨౩౯ జతనముగ దాచి చదువుము। రతనంబుల హారమి దియు। రసికులగళమా యతనము దీనికినేబహు। యతనము గావిం చి తెచ్చి। యిస్తీరనేడూ। బోధకుబందో। బస్తూరచూడూ। రత నా లెట్లవురాళ్ళు। రతనాలంచనియంచె। రతనాలీ పద్యాలే రసికు లెరిగెద రివినీ। కిస్తీరనేడూ। బోధకు బందోబస్తూర చూడూ॥

౨౮౦. నన్నాశ్రయించినావని । యన్నా యీబోధనీకు । ఆతుకుటకొరకై । యెన్నోయుక్తుల జెప్పితి । విన్నావాదీన్నినీవు । విడువకెప్పటికీ ॥ నాయాజ్ఞాను । గడువకెప్పటికీ । నన్నునీవు నిన్ను నేగన్నా వేళ్ళెట్టిదో । నన్నునీవు విడలేవు । నిన్ను నే విడలేను । విడువకెప్పటికీ । నాయాజ్ఞాను గడువ కెప్పటికీ ॥ * *

౨౮౧. నీమానసమున సంశయ । మేమాత్రము నిల్పబోకు । మికనాతోడే । నామాట నిశ్చయమునే । నేమాత్రము దాచలేదు। నీతోడుసుమ్మీ । యింతకుమిక్కి । లిక లేదులెమ్మీ । నామీద తలపుంచు ననుమరువకిక నేను । నీమీద దయవుంతు నిజమిందుకిదె వొట్టు । నీతోడు సుమ్మీ । యింతకుమిక్కి లిక లేదులెమ్మీ ॥

౨౮౨. నీగురుబోధను నీచె । బాగుగ వినినిండజేయు భ్రష్టులమాటల్ । లోగాని నిడిచేవిది । నీకెగురుడీలాటి బోధ । నెరిగించడోయీ । యెరుకలోదె యెరిగించునోయీ ॥ అగురుబోధల నన్ని నే దెలసుండి । నాగురుబోధ । నేనయముగ నీకిస్తి। యెరిగించడోయీ। యెరుకలోదె యెరుగించునోయీ ॥ * * *

౨౮౩. నిక్కముగ బీరపీచుల చిక్కుసుమీ విచ్చరాదు ఛీ యీ యెరుక । మక్కువ నేబోధించిన చక్కని బోధాగ్నిచేత । సాధించుపోరా ॥ విచ్చేచింత । చాలించుకోరా । చోక్కమాయీ బోధ । కెక్కడ యీడౌను । తక్కిన బోధల । దిక్కుచూడకదీని । సాధించుపోరా । విచ్చేచింత చాలించుకోరా ॥ * *

౨౮౪. పెద్దల నిందయొనర్చకు । పెద్దల సేవించురొరకు పిరిదివియకుమే । పెద్దలతో వాదించకు । పెద్దలు జెప్పేటిసుద్ది । పెడ చెవుల వినకూ । పెద్దలు నడిచె । నడక నేమనకూ । పెద్దలకన్న నే పెద్దనంచనుకోకు । పెద్దల గనుగొన్న ప్రియముతో మ్రొక్కుము । పెడచెవుల వినకూ । పెద్దలు నడిచె । నడక నేమనకూ ॥ *

౨౮౫. తనకు శరణన్నవారల మనుసెట్టిదో । తరచిచూచి మరితెల్పదగుక । వినువారికి తగినట్టిది । యనిరిట్లు మహానుభావు ।

లతిచాతుర్యమునా । వినికని నీమను సతిచాతుర్యమునా । ఘనమైన యీబోధ । కరుణిస్తిదీన్ని । వచ్చినదాక । నిదురవచ్చినదాక । మరువాకు । మతిచాతుర్యమునా । వినికనినీ । మనసతి చాతుర్య మునా ॥ * * * * * *

౨౮౬. చెప్పదగు గురుడు బోధను । చెప్పినపని జేసెనేని । శిష్యాగ్రణికిక ॥ చెప్పదగదు చెప్పిన పని । తప్పని వాదించెనేని దయదల్చిబోధా । యిద్దరికుండ దగునిట్టి మేధ । చెప్పీముందుగబోధ చెప్పండి పనులన్న । చెప్పగూడదువాన్ని తిప్పాల బెట్టాక । దయ దల్చి బోధ । యిద్దరికుండ దగునిట్టిమేధా ॥ * *

౨౮౭. నాలుగు శిశ్రూషణములు । లోలతగావించుకొనుచు లోకాతీతం । బాలోకించీ గురునిచే । యీలోక ముజోలివిడువు । మింతేచాలన్నా । నీతోగూడ । యిదిమరువకన్నా । కీలు దెలియని చదువు చాలాజదివెందుకు । చాలించి నీవిట్టి ॥ కీలు దెలిసితివేని ॥ మింతేచాలన్నా । నీతోగూడ యిదిమరువకన్నా ॥ *

౨౮౮. గురుసూచనైన నరులను । మరిమరి వినుమనుచు జదువు మాపద్యములక ॥ గురుసూచన యెరుగనియా । నరులను వినుమనుచుజదువ । నగుబాటవు గదరా । అదియెట్లన్న యిదుగో నేదెల్పెదరా । పురుషాసంగతిలేని । పోలతి కొక్కోకశాస్త్ర । మర సిమెచ్చునెదాన్ని । యతిప్రౌఢసతివలె । నగుబాటవుగదరా । అది యెట్లన్న । యిదుగోనేదెల్పెదరా ॥ * * *

౨౮౯. యెవరుంటె యేమిభయమురా । నవరింతురు తప్పా లుంటె సాధులువిన్నక । సవరించ నిప్పుమిదివిని । యవనీతులు నిందజేస్తె । అయ్యోదేమోయీ । అందులోమనది పొయ్యోదేమో యీ । భవనాశస్థితిలేని పద్ధాతి యీబోధ । చౌరంగవినిపించు చా టేల మాటేల । అయ్యోదేమోయీ । అందులోమనది । పొయ్యో దేమోయీ ॥ * * * * *

౨౯౦. నాబుద్ధికి సరిపడ్డది । నీబుద్దేకానియన్ని నేర్పులగని నక । చీబద్దుల యాబుద్దులు । నాబుద్ధికి మెప్పారావు నాతండ్రి

వినరా । శాబాసు నిన్నే తండ్రిగ నెరా ॥ యీబుద్ధి నికమాన కేబుద్ధి బూనాకు । యేబుద్ధి బూనీన । నీబుద్ధి చెడిపోవు । నాతండ్రివినరా। శాబాసు నిన్నే తండ్రిగనరా ॥ * * * *

౨౫౧. కొట్టితి తిట్టితి శ్రమలన్ । బెట్టితి నీమనవి చెవునం బెట్టక పెడచా । బెట్టితి మొట్టితి వెడలన్ । గొట్టితి నీమనసుదెలియ కోపాము లేకా । సరెతెలిసెనీ వోపికపోకా । పట్టుమిచ్చెద యింక నష్టేమి యనిదయ । బుట్టియిచ్చితిబోధ । గట్టివాడవురోరి । కోపాము లేకా । సరెతెలిసెని । వోపికపోకా ॥ * *

౨౫౨. నీవెంత కొట్టితిట్టిన ॥ నేవిడిచెవాడగాను నీచరణంబుల్ । చావైన పెండ్లియైనను । నేవిడువ నటంటివట్టి నిజభక్తుడ వెరా । నేగనుగొంటి । నీనిష్టనారా । కావున నీకిట్టి ఘనమైన యీబోధ । వేవేగ దయజేస్తి । నీవిదివిడువాకు । నిజభక్తుడవెరా । నేగనుగొంటి నీనిష్టనారా ॥ * * * *

౨౫౩. నానోటి మాటవెంబడి । తానెప్పుడు సంచరించె తగ నీచిత్తం । బేనదిగనియీబోధ । నిదానమునీకిస్తి దీన్ని । దాచుకోసుమ్మీ । నిత్యము నీవు చూచుకోనమ్మీ । యేనరుడైననినీన్నిబోధ నడిగీతె । వానిమనసగయాక వానీకి జూపేవు । దాచుకోసుమ్మీ । నిత్యమునీవు । చూచుకోనమ్మీ ॥ * * *

—( దృష్టదార్ష్టాంతములు. )—

౨౫౪. దృష్టాంత మెరుకకేదని । మోష్టము గదిలించగానె యొరులు కలనుచున్ । దార్ష్టాంత మడుగబోధకు। స్పష్టముగాకన్నా రము । దీపము జూపవోయీ । యీయుక్తిలో । పముజేయకోయీ తుష్టినొందెదరిట్లు దోచిచెప్పితివేని । శ్రేష్ఠమా యీబోధ చేకొన్న వారు దీపముజూపవోయీ । యీ యుక్తిలోపము జేయకోయీ ॥

—( నిజశిష్య నిర్ణయము )—

౨౫౫, జలమునెడబాయనొల్లని । జలచరముల శీవిబూని । సచ్ఛిష్యుడు । వాల్జలజంబను పీఠముపై । నిలిపితరముమాని । గురు

వూనేకొల్చుసుమీమ్మా । తదూక్తుల । నేతల్చునమీమ్మా । కలకాల మీరీతి గడుపూచు నేప్రొద్దు । తలిదండ్రి దొరదాత దైవమనుచు గురువు । నేకొల్చుసుమీమ్మా । తదూక్తుల । నేతల్చునమీమ్మా ॥ *

౨౫౬. సతిపొరుగూరికి బోయిన । పతిరాకడ కోరినట్లు బావములోనం । మతిమంతుడు సచ్ఛిష్యుడు । సతతముగురు రాకగోరు సత్యాము వినరా । వానితోటి ॥ సాటెవ్వరనరా । హితునిరాకడను స్నేహితుడు గోరినయట్లు । అతిదరిద్రుడు ద్రవ్య తతిరాగోరిన యట్లు । సత్యాము వినరా । వానిదోటి । సాటెవ్వరనరా ॥

౨౫౭. అతివెలరతిచతురుతలా యతివలచే వారితంద్రు । లర యరనుచు । తత్వతులరయరె రతినట్లనె । మతిమంతుడు గురుడు బోధ । మానీనగానీ । తద్బోధతా । మానాడుపూనీ । అతిదరిద్రుని చేవిద్యార్జించి నతగాడు । చతురుడై విత్తమార్జనజేయు పంతూలు । మానీనగానీ । తద్బోధతా । మానాడు పూనీ ॥ * *

౨౫౮. దేశికుని చరణతీర్థము । కాశీగంగయని । గురుని గనుగొన్నను విశ్వేశుడని యతడుతన । కుపదేశంబొనరించినట్టిదే । తారకమనీ । మనుసందుతా । నీతీరునగనీ । యేశీమయందున్న కాశిప్రయాగ ॥ రామేశుని పురమై ॥ ప్రకాశించు నాశీమ । దేతారకమనీ । మనసందుతా । నీతీరునగనీ ॥ * * *

౨౫౯. గురుచరణజలము । గోదావరియని । గురుమూర్తి రామ భద్రుండని । తత్పురమును భద్రాచలమని । గురుమంత్రమె తారకమని । గురిగలిగినట్టీ । తిరిగిరాని । మరుగెరిగినట్టీ । నరుడున్న చోటె సుందర శేషగిరిభద్ర । గిరిరంగనాయాక పురమానదగియుండు ॥ గురిగల్గినట్టీ । తిరిగిరాని మరుగెరిగినట్టీ ॥ * *

౨౬౦. ఇంగితము నెరిగిసద్గురు । పుంగవుచే నరుడుభుక్తి । ముక్తిక్రియలన్ । సంగాసంగము లెడలిన । శృంగారమె వానిచేష్ట చూచెవారలకూ । వాడున్నట్లు । తోచెవారలకూ । మంగాళసూత్రమే భంగి శృంగారమొ ॥ శృంగారవతికి । యశృంగారవతికట్లు । చూచెవారలకూ । వాడున్నట్లు । తోచెవారలకూ ॥ *

౨౬౧. దూరమున నుండి విన్నను జేరును సజ్జనుడు । గురుని చెంతను బోధం । గోరి దుర్జనుడు గోరడు దూరస్థుడుగాక గురుని తోగూడియుండీ । యెట్లని యన్న । దూరాననుండీ। కోరితుమ్మెద తమ్మి । జేరి తేనియగ్రోలు । నారీతి నెరుగావు । చేరికప్పలుతమ్మి। తోగూడియుండీ । యెట్లనియన్న । దూరాననుండీ ॥ *

౨౬౨. తనగురుబోధను తాజదివినవిను జనవితతిమదికివింతై యీబోధను నేర్వకున్న వ్యర్థము। జననంబని తోచిశరణు । శరణానెటట్టూ । వెంటనెవాండ్లూ । దరిజేరెటట్టూ । ఘనమైన యుక్తి జేసీనవాడె శిష్యుడు । అనుమాన మేమిందుగనరాదు। వినవోయి శరణానెటట్టూ । వెంటనెవాండ్లు । దరిజేరెటట్టూ ॥ *

—( గురుస్తవము )—

౨౬౩. గురువర మీనాసందున । యెరుకను తెరగలిగి । యుండె । యిన్నాళ్ళ గొలెక్ । కరుణారసేక్షణములక్ । తెరదీశితిరెరుక మూటా । దీరెనిక్కడికీ । చాలుబోధ దూరెదెక్కడికి । పరిపూర్ణ మును లేని యెరుకానుజూపించి యెరుక లేదనియంత్రి యెరుకె లేదాయాను । తీరెనిక్కడికీ । చాలుబోధ । దూరెదెక్కడికీ ॥ *

౨౬౪. ధారుణి కొంతజరించి । విచారించితిగాని యీవిచారమునే నెవ్వారలు జెప్పగవినలే। దారయమీనోటవిన్న దయ్యా గురుమూర్తీ । నా తరమా నుతిజెయ్యా । మీకీర్తి। సారాసనయన పురారి నీరజ బృందారాక ముఖులైన నేరారుమిము దెలియ నయ్యా గురుమూర్తీ । నాతరమానుతి । జెయ్యా మీకీర్తీ ॥ *

౨౬౫. ఘటమెదుట బెట్టిచూపిన । యటువలె బయలుండజూపి । యతిమాయలచె । నటియింపుచున్న యెరుకను । తృటిలో విడిపిస్తిరిపుడు । దీరెమచ్చంకా । యికబుట్టాను యేరీతిశంకా । యెటుదోచకిలువెళ్ళి యిటుమిమ్ము జూచీన । ప్పటినుంచి దయ జేసిప్పటిదాక బోధిస్తె । తీరెమచ్చంకా । యిక బుట్టాదు యేరీతి శంకా ॥ * * * * * *

## —( గురుశిష్యోభయనిర్ణయము )—

౨౬౬. హృదయగ్రంధి విడుటకై సదయత యీబోధదెల్ప జనదాగురుడై । వదలక చిత్తములో । గురుపదయుగళము దలుప వలదే । భక్తుడైనపుడూ । భ్రాంతిరహిత సక్తుడైనపుడూ । కుదురాదు యివిరెండు గురుశిష్యులకులేక । కదిలికె లేవట్టి ఘనబోధోక్తస్థితి । భక్తుడైనపుడూ । భ్రాంతిరహిత సక్తుడైనపుడూ ॥ *

౨౬౭. గురుడాస వదలకుండిన । మరిశిష్యుడు । ద్రవ్యలోభ మగ్నుండైనన్ । మరియాదదక్కదిరువుర కెరగుంటుము వీరలతి విహీనులోయన్నా । గట్టిగ దురభిమానులోయన్నా। గురుడు శిష్యుని కన్నకొడుకూగ గనకున్న । గురునిపై శిష్యు । డాగురి నిల్పకుండీన । హీనులోయన్నా । గట్టిగదురభి।మానులోయన్నా ॥

౨౬౮. పతియైనను సతియైనను । నతిసాహస పరులుగాక యాంతర్యమునన్ । రతివేళ్ళ లజ్జపడ సంతతిగలుగదు చూడు మట్ల । తగదులజ్జించా ॥ గురుశిష్యులు । తగులజ్జనొంచా । మతిని నీవిట్లు సమ్మతిజేసియేయె । సంగతి నన్నడుగుముబోధ। స్థితినీకుదృఢ పరతు తగదు లజ్జించా । గురుశిష్యులు । తగులజ్జనొంచా ॥ *

౨౬౯. అడివి పుళిరికెయు జలనిధి । బొడమిన లవణంబటంచు బొగడినరీతిం । పుడమిని యీస్థలమందున । కడువేడుక నీవు నేను । గలుసూట వినరా । నీనాప్రేమ । కలసెకనుగొనరా । విడలేవు నీవునన్ను విడలేను నేనిన్ను । పొడజూచి నీవు నేనెక్కడబోక నిలిచిట్లు । కలుసూట వినరా । నీనాప్రేమ । గలసె గనుగొనరా ॥

౨౭౦. కూడిగురుశిష్యులిద్దరు । వేడుకతో బయలువున్న విధమెరిగెరుకన్ । వీడిరిది లేనిదని మాటాడుటకిక యేమిదోచ । దదియేమోకానీ । వింటిరెమీరలిది । యిందులోనీ । జాడ మీకెరుకాని వేడీతివినుమంచు । యీడికి సరిము । చ్చటాడూటకిక దోచ । దదియేమోకాని । వింటిరెమీర । లిదియిందులోని ॥ *

## —( కపట శిష్య నిర్ణయము. )—

౨౭౧. పరిపూర్ణబోధ దెల్పె పరియంతము సేవజేసి । బహు

నమ్మికగా । గురుమూర్తికి తరువాతను । మరికన్నుల గననివాని । మార్గాము ఛీఛీ । తలచరాదా ; మాట ఛీఛీఛీ । గురువాజ్ఞ యివనీదే గురువై శిష్యులగూర్చి । గురుబోధదెల్పేటి గురువంచకుని యొక్క । మార్గాముఛీఛీ । తలచరాదామాటఛీఛీఛీ ॥ * *

౨౭౨. తనశిష్యులు పిని తననతి । వినయంబున గొల్చు కొరకు వినుతి యొనర్చు । తనగురువును గురుడింటికి ॥ జనుదెంచిన జూచి । శ్రుశూష నొనర్చకుండా । లేమిని దెల్పి । చనుమానుచుండా । వినుము కుచ్చిత శిష్యాగ్రణివీడు వీడెట్లు ఘన బోధోక్తస్థితి గనునో గురునకు । శ్రుశూష నొనర్చకుండా । లేమిని దెల్పి । చనుమానుచుండా ॥ * * *

౨౭౩. కుటిలాత్ముడైన శిష్యుడు । యిటువలె తాబల్కుచుండు । నింటికివస్తే । యెటుబోవుచుండి వస్తిరో । యిటకిక దర్శనముమళ్ళి । యెప్పూడైయానో । యెవరికి దెలుసు । యెప్పుడేమానో । యెటుదోచదేమైన యిత్తామంచనుకుంటె । తుటుకూన వాకరాగి దుడ్డైనలేదిప్పు । యెప్పూడయ్యానో । యెవరికిదెలుసు । నెప్పుడేమానో ॥ * * *

౨౭౪. జపములు తపములు సలుపును । విపరీతస్మరణ జేయు వేదాంతార్థం । ఒపరిమితంబుగ జెప్పును । కపటాత్ముడు శిష్యకోటి గనిమెచ్చుకొరకూ । మెచ్చిద్రవ్య । మును యిచ్చుకొరకూ । అపకీర్తి చేతాల కదరినట్లగుపాడి ॥ ఉపమూచె బ్రతుకూచు నుండు లోకులుతనను । గనిమెచ్చుకొరకూ । మెచ్చి ద్రవ్యాముని యిచ్చుకొరకూ ॥ * * *

—( బోధానర్హులు )—

౨౭౫. జ్ఞానవైరాగ్య భక్తి । సమాన నదీస్నాన దేవమంత్రపఠన । తధ్యాన మఖతంత్రములుపర । మానిని రతిగోరునట్టి । మనుజాసంఘముకూ । బోధనుదెల్పు మనిన వారలకూ । తాను బోధించుట తగదు బోధించితే । తానునేననుభ్రాంతి తలగెదేలా గట్టి । మనుజా సంఘముకూ । బోధనుదెల్పు మనినవారలకూ ॥

## —( అశరీర పద్ధతి )—

౨౭౬. వొంటుకుబాపల బిందొ్వౌం టంటించిన కొలదిలెక్క యధికంబగునా । వొంటుకు వలపలబిందొ్వౌక । టంటించ లెక్క ఉల్లక్యాగదనోయీ । వొంటుండి లెం । డాగదనోయీ । తంటా దీరునుజూడు దానివలెనెయెరుక । కంటెబయలును తానుగలిసుండి తపకుళ్ళక్యాగదనోయీ । వొంటుండీలేం । డాగదనోయీ ॥

౨౭౭. నీకలలో నిను నన్నును । లోకుల లోకములజూచి లోపలి భ్రమచే । నాకరుణబడసి మేలుక చేకొని కలకల్లజేసి । చేరేదవెటకో । సర్వమునీతో చేరినీయటకో । ప్రాకాటముగ బట్టబయ లెరుకలీరీతి । నీకు దెలిసినమీద నిలువాక వేవేగ । చేరేదవెటకో । సర్వమునీతో చేరి నీయటకో ॥ *

౨౭౮. కలనెడిబాసిన మనుజులు । కలలోపలి పనులు చేయ కలవారననా । కలవారుగారు వారల । వలెయెరుకను గురునిచేత । వదలెరుకలోనా । గలపనిచేయ । వలదెరుకలోనా। కలవారంచనినోట పలుకూట మరయాక ॥ పలికీనవారికి తొలగాదు పాపాము । వదలెరుకలోనా । గలపనిచేయ । వలదెరుకలోనా ॥

౨౭౯. క్షితిలోన నరుడుపక్వా । న్నతతిని దిని కక్కి మరల నాకునే యతిసంసృతి విడిచితిరిగి పూనునె । వితరణశాలిచ్చినట్టి । విత్తామడిగీనే । సత్యవాదీ । సత్యాముడిగీనే । ప్రతిలేని గురుబోధ స్థితిజెందియెరుకాని । గతిసంగ్రహించాడు । కృతకృత్యుడిచ్చీన । విత్తామడిగీనే సత్యవాది సత్యముడిగేనే ॥ * *

౨౮౦ జగమువలన సంకల్పము । జగమాసంకల్పమునను జనియించునువే । రగుపడదు జన్మమందిర ॥ మగుపడ దెడబాసి నిల్వ । వారెండెన్నటికీ । బయలును గనినీ । వీరెండెన్నటికీ । యికదల్చబోకూము యివిబుట్టుటుళ్ళిక్కి । మృగజలమగుపడ్డ మి ద్యంచెరిగినమాడ్కి । యారెండెన్నటికీ । బయలునుగని నీవి । రెంటెన్నెన్నటికీ ॥ * * * * *

౨౮౧. గురుడచల చలములను తన । కెరిగించిన శిష్యుడె రిగి యెరుకై యుండగ । యెరుకను నిల్పకుమని నను । యెరుకను విడనాడి శిష్యు । డెట్లుండు నంటే । అట్లనెనే నింకెట్లుండు నంటే । పురుషుడు లేనట్టి పోలతి సౌందర్యాము । మరిమరి కలిగుండి । మరి లేనట్లని యంటి । యెట్లుండు నంటే । అట్లనెనే నింకెట్లుండు నంటే ॥ * * * * * *

౨౮౨. యెరుకను విడనాడి నయూ । పురుషునిస్థితి యెట్టి దనిన పొందుగ వినుమీూ । సరిపడు సరిపడదనకన్ । సరిగా వర్తింపు చుండు సమరస బుద్ధిగ । కార్యమూలందు । సహజ ప్రి । వృద్ధిగ । పరిపారి విధమూల పరుపూలు బెట్టాడు । మరి వైరాగ్యము చేత మానుకొనుండాడు । సమరస బుద్ధిన్ । కార్యములందు । సహజ ప్రవృద్ధిన్ ॥ * * * * * *

౨౮౩. అనహాంకారుడని మిషుడు । గనుకనె విశ్వాంబనేటి కలగానడ హాం । బనువాడు సనిమిషుడుగా । వున విశ్వాంబనేటి స్వ । ప్నోద్యోగాము బూని । చేయుచు యూ । వుద్యోగాము మానీ । యనునూ సప్నోద్యోగమునకు నేకారణ । మనితానని మిషుడెన్నడనుకోడీ మాటూ ను । ద్యోగాము బూనీ । చేయుచు యూ వు । ద్యోగాము మానీ ॥ * * * *

౨౮౪. కలమేలుకొన్న పురుషుడు । కలలోపలి బాము లెరుక గలిగుండగనే । తిలకింపలేవు గురుకృప । తెలివొందిన వాని కింక । తిప్పాలున్నావే । తెల్పర కొద్ది గొప్పాలున్నావే । తలిదం డ్రి దొరదాత కులదైవ మాప్తులు । కలబాంధవులు దేశికులని నమ్మితె యింక । తిప్పాలున్నావే । తెల్పర । కొద్దిగొప్పాలున్నావే ॥

౨౮౫. ఈరీతి స్థితిగలిగిన । నేరుపుశాలి యితర జనులనిం దాస్తుతులన్ । తారేగిచేయ డెన్నడు । వారలు మరి జేసిరేని వల దాని యనడూ । చెవియొగ్గి । కావలెనాని వినడూ ॥ వారు మీూ

వారు మావారు వీరనుకొంచు । స్వాకేక ; వీధిలో పోరాడేవాళ్లని ॥ వలదానియనడూ ॥ చెవియొగ్గి । కావలెనాని వినడూ ॥ *

౨౮౬. ధ్వనిమొదలగు తన్మాత్రలు । గనుకొనగాలేశమైన గాన్పించనిచో । టునుబట్టబయలుగాగని. । ధ్వనిముఖతన్మాత్రలున్న దాన్నె యెరుగకనూ । గనియీరెంట్లో దేన్ని యెరుగకనూ ॥ వ్రునికి గలిగినయట్టి । ఘనుని సన్నుతిజేయు । జనులాకు సఖ్యమంచనరాదు వినరాదు। దాన్నె యెరుగకను । గని యీరెంట్లో దేన్ని యెరుగకనూ॥

౨౮౭. హాటమున కటిలాత్మనిజం । వుటకై భటకోటికాజ్ఞ భూపతి యిడినట్ । భటులటువలె జేసెటిలో । పటకుటిలుడు బడిన పాట్లు । పాటించికనునా । అట్లనె గురుని । నోటతావినెనా । యాటు వంటి బోదాను యెటువంటి నడతైన । అటువెనుక తనచేష్ట లెట్టు వంటివోవాట్ని । పాటించి కనునా । అట్లనె గురుని నోటతావినెనా॥

౨౮౮. తనుమనధనములు గురునకు । వినయంబున ధార బోసి వేడ్క గురునిచే । అనువైన బోధవడసిన । ఘనమతిమంతు నకుసాటి గలదాయీభువినీ । లోకులు మొక్క । వలదా చవ్రుల వినీ । తన నితరులనె తాననక యేమాటను । వినక పరిపూర్ణత దనరువానికి సాటి గలదాయీభువినీ । లోకులు మొక్క। వలదా చెవ్రులవినీ ॥ * * * * * *

౨౮౯. గురుగురుబోధలచేతను । పరిపూర్ణము నెరిగియెరుక బాసిన యతనిక్ । గురుతెరుగ నొరులసఖ్యమె । యెరిగిన నరులిట్టి బోధ । నెరిగేరోయన్నా । వారెరుగాని। మరుగుండదన్నా । చిరుత పాపనికీతి మరిపై శాచముభాతి । తిరుగూచునుండు బెక్కురుమాడ్కి గురుడెట్లు । యెరిగేరోయన్నా । వారెరుగాని । మరుగుండదన్నా ॥

—( ముఖ్యాధికారి యాథార్థత )—

౨౯౦. దేశాటనంబు జేసితి । వ్రాసితి గ్రంథములుకొన్ని వరగురుశిష్యుల్ । జేసెటి చర్చవింటిని । రోసితి మోహాద్యపేతు । రూఢిగ వినుమీ । నీవిట్టియీ । రూఢాతగనుమీ। దేశికుదయబుట్ట

జేసి శిశ్రూషోప । దేశాముగాని యుపదేశామిచ్చితి మెచ్చి। రాఢీగవినుమీా । సీవిట్టియా । రూఢాతగనుమీా ॥ *

—( గ్రంథపూర్తి )—

౨౯౧. శరశాస్త్ర స్వరహిమకర (౧౭౬౫) పరిమితమైనట్టి శాలి వాహనశకమం । నరయగ శోభకృధనువ । త్సరమార్గశిరంబు కృష్ణ । చవితినాటికినీ । పద్యాల్పదిదక్వ మున్నూటికినీ । మురయాచుజేస్తి నెవ్వరువిన్న చదివీన । పరిపూర్ణమెరుకై లేనెరుక లేకుండాన । చవితినాటికినీ । పద్యాల్పదిదక్వ । మున్నూటికినీ ॥

— (గ్రంథసమాప్తి. )—

౨౯౨. ఎరుక నెరుంగని బయలులో । గురుడును శిష్యుండు వారి గొడవయునేమీా । కెరిగించినవన్నియు । మీారెరిగిన వన్నియునుమీార । లేనునుళ్ళకీ । వుళ్ళకీతా । నెప్పూడుళ్ళకీ । మరియింక మాటాడ మాటెలే । దాయాను । సరిపాయ సరిపోతె సరిపాయ సరిమీార । లేనుళ్ళకీ । ఉళ్ళకీతా । నెప్పూడుళ్ళకీ॥

కందార్థములు సంపూర్ణము.

ఇతి శ్రీమద్భాగవతకృష్ణ విరచిత శక్తిద్వయ నిరాసకంబైన
శుద్ధనిర్గుణతత్వ కందార్థ నామగ్రంథసమాప్తః
శ్రీమత్పరశురామ సీతారామస్వామి
స్వగురు పరమగురు పరమేష్టిగురు
సద్గురు నిజగురు పరిపూర్ణగురు
పరబ్రహ్మణేనమః
శ్రీగురు చరణార విందార్పణమస్తు.

---



ఓం

శ్రీగురుభ్యోనమః

ప్రబోధ చూడామణియను

# క్షరాక్షరోపాది ద్వయదోషరహిత పరమతత్వ కందములు

—(౦)—

—( సభావిజ్ఞాపన. )—

కం॥ ఈకల కందములనువిను । శ్రీకల నరులారమీకు । వొప్పిదమైనన్ । నేకలగనుక రచించితి । యీకల మోక్షమును జెంద నగునివి వినినన్ ॥ * * * * * ౧

కం॥ మాటలేనట్టి బయలున । మాటగలిగె ననుటవినుట । మాయగదయ్యా । మాటమాయైతే మానేను । మాటనుమాట్లాడి మనము । మానుద మనలన్ ॥ * * * ౨

కం॥ ఏకందముకాకందమె । మాకందఫలరసరుచిని మరిపించు రుచిన్ । మీకందము లైననువిను । ఈకందములన్ని సత్కవీందుల్లారా ॥

కం॥ నేఛందము జదివెరుగను । నాచందంబిదియు గురుని । నమ్మి రచిస్తిన్ । యీచందపు పద్యములను । చూచందరు నగక దిద్ధుడీ సుకవుల్ ॥ * * * * ౪

కం॥ కథగాదు జననమరణ । వ్యథమానుటకై రచిస్తి వరకవు ల్లారా । మథియించి చూచిదిద్దుడి । పథమేమాత్రంబుదప్పి । పారక యుండన్ ॥ * * * * * ౫

కం॥ తక్కువ పాండిత్యముచే । నిక్కపండితులుమెచ్చ । నేరరు వీటిన్ । యెక్కువ పాండిత్యముగల । చక్కని పండితులు మెచ్చి । సరెనన్నట్లన్ ॥ * * * * ౬



కం॥ సూరిజనులె యీగ్రంథపు। సారము గనువారుగాని। సంసారమహా। ఘోరవారాసి జేరిన। వారలువిని దీన్నిజూచి। వచియింపుదురే॥ * * * * * ౭

కం॥ గొప్పప్రతిష్ఠకు మిక్కిలి। తిప్పలబడు నృతతికెపుడు। దీరదు వినసి। యొప్పుల కుప్పగు బోధను। తప్పక నామాటనమ్మ। దగుతప్పనతక్॥ * * * * * ౮

కం॥ మెప్పైన బోధగలమా। యప్పులు తప్పంబెదిద్దు। డది నాకిష్టం। బిప్పగిది కందములనే। జెప్పితి యీకవితజూచి। శిడి ముడిపడకక్॥ * * * * * ౯

కం॥ ఒకసారిమైనివినకక్। వికవికనవ్వేటి కుకవివేతల్లారా। ప్రకటించక మీశౌర్యం బికదాచుట మీకుమాకు హితవైరయొప్పక్॥

కం॥ స్వచ్ఛాన్వయగుచ్ఛములని। పృచ్ఛయొనర్చెదరుకవులు పృథుయశులారా। యిచ్ఛజనించిన జదువుడి। యచ్ఛాపద్యంబులివ్వి యాసాంతముగాక్॥ * * * * ౧౧

కం॥ తక్కిన బోధలవలెనిది॥ చిక్కులుగల బోధగాదు। చేపట్టదగుక్। మక్కువతో మీమునుపటి। చిక్కుల బోధలను చూర్ణ జెక్కిముదమునక్॥ * * * ౧౨

కం॥ సకలకార్యప్రయత్న। జనకమగు వస్తువనుబట్టి నలచి నైచుదీ। న్నొకసారి వినిన చదివిన। నికనింతకు యెక్కువైన। వేబోదలయా॥ * * * * * ౧౩

కం। కేరుచు మిము వినుమనినే। సారెకు మీచుట్టుదిరిగి। సన్నుతిజేసే। తోరపు బోధకు మూలం। బైరెవ్వరొ వార్నిదలచి। వరుసనుతింతుక్॥ * * * * * ౧౪

—( గురు పరంపరద్యాన్నం )—

కం॥ ఈశ్వర శివరామాహ్వాయ। దీక్షితులకు బోధజేసి। దిద్దినసామ్యా। దక్షుని శ్రీధరమూర్తిని। నిక్షేపముగాదలంచి। నే వినుతింతుక్॥ * * * * * ౧౫

కం॥ దక్షిణామూర్తి యనదగు। సీక్షితి శివరామనామ దీక్షి

తులనుచుఁ । వీక్షింతురార్యులతని క । పేక్షను దండములుబెట్టి ప్రేమనుతింతుఁ ॥ * * * ౧౬

కం। ఆదీక్షితుల కృపవదా । పాద్రైయ్యప్పయ్యమంత్రి పరి యించెనుయీ । మేదిని తద్బోధనతని ॥ పాదములకు నతులొనర్చి ప్రార్థింతుమదిఁ ॥ * * * * * ౧౭

కం॥ నతిజేసెద నప్పయ్యకుఁ । గతికై కొల్చితదుబోధ గనెనో నేనా । ప్రతిలేని పరశురామా । క్షితిసుర వంశమణియైన సీతా పతికిఁ ॥ * * * * * * ౧౮

కం॥ బుచ్చివెంకమ్మ తల్లిని । చెచ్చెర పెండ్లాడికాశి శేతువ దాకఁ । విచ్చలవిడి యగజల్లెను । సచ్చరితుల కచలబోధ సాకల్య ముగాఁ ॥ * * * * * ౧౯

కం॥ ఆసీతాపతి నతివి । శ్వాసమునంగొల్చికొంటి సర్వేశ్వ రుడం । చీసద్బోధను తేటగ। జేసితిసవిసకలజనులుచెవియొగ్గివినఁ ॥

—( గ్రంథకర్తవంశావళి )—

కం॥ భాగవతవంశభవుడను । భాగవతోత్తములపాద పద్మం బులకుఁ । సాగిలి మ్రొక్కేవాడను । బాగుగనను జనులుకృష్ణ । భట్లందురిలఁ ॥ * * * ౨౧

కం॥ ధారుణత్ర్యినసూయలు పి రేయనిజనులుబొగడ। వెలసిన వారల్ । నారాయణ జానకియను వారిరువురు గన్నయట్టి వాడను సుమ్మీ ॥ * * * * ౨౨

—( గ్రంథవిషయము )—

కం॥ ఆనేనొనర్చినాడను । యీనిజకందములగ్రంథ మెప్పుడు దీనఁ ॥ వీనులవినికన్నులగని। రేనట్టిజనంబుబల్కునే నేననుచుఁ॥

కం॥ చిల్లెర బోధల నన్నిటి । నొల్లరునిజబోధ దెలసి యొ ప్పెటిపెద్దల్ । పొల్లని యందుకె నేననవి వల్లక యీబోధయందు । వర్తిస్తిజుమీ ॥ * * * ౨౪

కం॥ గురుశిష్యుల మాటలవలె । పరిపూర్ణపుబోధకథ పద్య

ఫణితిచే । విరచిస్తి వినుడిముందర । జరిగేముచ్చట్లుమీకు సహ్యాం
బైనన్ ॥ * * * * ౨౫

కం॥ సకల నిగమాగమాది । ప్రకరమహా నారికేళ ఫల
సారము । దీసాకగ్రంధము జేసితి । లౌకికజనులోక వేళ్ళగొన్న ।
కీడుదొలంగున్ ॥ * * * ౨౬

—( గురుశిష్య అన్యోన్య దర్శనం )—

కం॥ తనకుదావచ్చి సద్బోధనుదెల్పు మటంచుమ్రొక్కు తన
శిష్యునకున్ । వినజెప్పదొణగె నొకగురు । డనుమానించకనువాని ।
కతిదయతోడన్ ॥ * * * * * ౨౭

కం॥ పరమ పురుషుడును । లేనిది యెరుకయుగల దరసి లేని
యెరుకనువిడుమం । చెరిగించిన శిష్యుడు గురువరునడిగెను మ్రొక్కి
రెంటి వర్తనలపుడున్ ॥ * * * * ౨౮

—( శిష్య ప్రశ్నావళి )—

కం॥ పరమపురుషుడననెవ్వడో । యెరుకెట్టిదో తెల్పియవల
యెరుకను విడిచే । తెరువెట్టిదో యిన్నియునా కెరిగించుమటంచు
బల్కె నిట్లనె గురుడున్ ॥ * * * ౨౯

—( గురు ప్రబోధము )—

కం॥ నేపెద్దలచే విన్నది । నీపై దయబుట్టిచెప్ప నేబూనితినీ
కాపద్ధతినంతయువిని । యేపద్ధతికాశపడకు మిదివిడువకుమీ ॥ ౩౦

కం॥ కదలడట పరమ పురుషుడు । కదిలిక మాయయట ।
యిట్టి కదిలికకేదో । మొదలన పెద్దలు బల్కిరి । కదలనిదే కలదు-
లేదు కదిలికయనుచున్ ॥ * * * * ౩౧

కం॥ పురుగుక్కు స్తంభంబును । గొరికినదన వీతిహోత్రు
గొనిమ్రింగెచదల్ ।ధరనినమాయాసతి హరినిచి కౌగయొనర్చె
ననవినదగునే ॥ * * * * ౩౨

కం॥ హరియందు దోచువిశ్వము । నరస్వప్నము వంటిదనిరి
నానాజనముల్ । సురస్వప్నమువంటిదియనె । స్థిరమతి శివరామ
నామ దీక్షితులుధరన్ ॥ * * * ౩౩

కం॥ సురలందు దోచుస్వప్నము । హరియందునదోచువిశ్వ మాసురలహరిన్ । యెరిగిన కలవిశ్వము । తామరుగవె తమలేమి నెరిగి యతిబిడియమునన్ ॥ * * * * ౩౪

కం॥ కదలనిది కదలదెన్నడు । కదలికగల దనినదాని కగుపడ దు మొదల్ । కదలిక లేదది గావున । యిదిపరమరహస్య । మెవ్వ రెరుగరుదీనిన్ ॥ * * * ౩౫

కం॥ కదలనిది కదిలెనన్నను । ముదమునవిన దగదువారి । ముచ్చటనెపుడున్ । కదలిన కదలనిదెట్లగు । నదిగావునకదలదనుచు నమ్మదగుజుమీ ॥ * * * * * ౩౬

కం॥ నినుమేనును ప్రకృతిద్వయమని । నినునీమేను మృషని మాసిరి నీజోలిని పెద్దలు నీవెరుగక । నినునీవొక కొండనంటె । నిజ మామాటా ॥ * * * ౩౭

కం॥ పేరచలమనుచు బయలని । పేరెప్పుడు లేనిమనము బెట్టుట చాతన్ । పేరాయె బయలుకిప్పుడు । పోరానివు నేను మృషని పో తేజాలున్ ॥ * * * * ౩౮

కం॥ పరమపురుషుడీబయలని । గురుడెరిగించినను జూచి । గొప్ప కురుచతై । యెరిగెటినినునే మృషనని । యెరిగరుగుమునీవె మాయ లికబుట్టవిలన్ ॥ * * * * ౩౯

కం॥ అయమాత్మ యనినరీతిగ నయముగ యీబట్టబయలు నదుగోయనుటల్ । అయమియు మనియనుటుల్లక్కి అయిన నన వలసె నీదుకీడుడుగుటకై ॥ * * * * ౪౦

కం॥ లేనినే నీవులేని । స్థానంబును కారణంబు సర్వమునకధి ష్ఠానంబు సాక్షిసత్య జ్ఞానానందంబులనిన సత్యములగునే ॥ ౪౧

కం॥ అట్టిది యిట్టిదియనరా నట్టిది బయలనుచు దెలిసి యీ మీదట నీవట్టిది యిట్టిది యనరా నట్టిది బయలనినదాని నరయకు మెపుడున్ ॥ * * * * ౪౨

కం॥ అదియిదియంచని యనరానిది బయలని తెలిసి నీవు ।

యిదియది యనరానిది బయలని తెలసిన నిను వదిలుండుము లేస టంచు వరగుణవంతా ॥ * * * * ౮౩

కం॥ కలనీకు జగముకంతట । గలబయలుకుగలిగియున్న ఘన మగుతిప్పల్ । కలయగని మేలుకొనియా కలవలె మేలుకనుజూచి కదలుముళ్ళక్కీ ॥ * * * ౮౪

కం॥ కలనేన్గు సింహామును కన్నులగన మృతిజెందినట్లు । యుళ్ళక్కగునీ వలగురు కృపచే బయలుం । దెలసూరికె యుంటి వేని తీరునుమాటా ॥ * * * * ౮౫

కం॥ ఎప్పటికి యొక్కరీతిగ । తప్పక నిలచున్నదాన్ని దయ తోగురుడుం జెప్పినగని యగణితమగు । తిప్పలుగల నిన్నునీవు । దీశితె సరిరా ॥ * * * ౮౬

కం॥ నీవున్నచోట నుండును । నీవివిధ విచిత్రజగము నీతో గూడన్ । నీవులేనట్టిచోటను। నీవివిధవిచిత్రజగము నిలువదుకుర్రా।

కం॥ నానావికారములుగల నానావిధ నామరూప నటనలు గలయిా। నీనాదశదిశలనుగల। దీనందేలేకమనము తిరుగుటమప్పా॥

కం॥ అబ్బీ యీబయలున్నది దబ్బునగురుదెరుకజేయ దబ్బర ననుచున్ । దెబ్బకు మాయముగాకను కబ్బముజెప్పటకునిల్వ గలవే నీవున్ ॥ * * * * * ౮౯

కం॥ మూలములేకనె వచ్చిన । నీలీలలు జూచుకొని నీవె ముగతువీ । బయలున్నదనుచు దోచితె నీలేమిని నీవెరింగి నిలు వకు కర్రా॥ * * * ౯౦

కం॥ జ్ఞానకర్మ స్వరూపముగానిబయల్ నదుగొచూచి । కలకాలముయిా । జ్ఞానకర్మస్వరూపంబా । నినునీవెరిగి వ్యావసని పనివినవోయిా ॥ * * * * * ౯౧

కం॥ ఈనిర్మలమా బయలున । నానాగమ నిగమకల్ప నాయనటంబె । యేనరులు నమ్మరిందుకు । నానీయందునననటంబు నమ్మినవమాటక్కీ ॥ * * * * ౯౨

కం॥ నేనీవనని మహాత్ముని । తనగ మాగమవిచారమిష్టతి
యానా । నేనీవని యీపల్కే నానికే యిష్టతేర నానాయన్నా॥

కం॥ కలవేళ్ళను యీమేల్కను । గలయీబయలుండజూచి
కలమేల్కలలో । గలతేని నిన్ను నీమేనుల నేనని నీవుదెలిసి యుం
డుమనుచాలుర్ ॥ * * * * * ౫౪

కం॥ మేనుజడ మజడమనినను । నేనును మీరెంచు గలసి
నేననబడు । స్వప్నానందమె మదవస్తగు నేనేనను మృషని తెలియు ।
నేమృషనౌదుర్ ॥ * * * * ౫౫

కం॥ నేనతాన నేనావలె । యీనేలేనట్టి బ్రహ్మ నేనన
తన్న నేనందు నేనులేనిదె। మేనుజగత్తులైవారెచి మృషనౌకోంచుర్॥

కం॥ కానకావాహమతములు । నానాగమ నిగమసమితి ।
నామమురూపం । బనులేనపుడు నాకై నేనరుదెంచినను నెంతు నే
యపినమ్ము ॥ * * * * * ౫౭

కం॥ నామీాది ప్రేమచేతను । యీమనుజులు నిలుపదలచి
యెన్నోయుక్తుల్ । తామొనరించిన నిల్తునె । నేమృషమృష నిల్వ
గలదె । నిశ్చయమునలేర్ ॥ * * ౫౮

కం॥ నీతండ్రి తాతలవలెనే । నీతనయులు నీవుజనుట నిశ్చ
యముకదా । మీాకోటిరాదుగదబయు లీతెరగెరిగిపుడు శూన్య ।
మేదోగసరా ॥ * * * * * ౫౯

—( బయలు లక్షణము )—

కం॥ బయలెపుడు పుట్టిగిట్టదు । బయలెప్పుడు ముట్టుకోదు ।
బ్రహ్మాండంబుల్ । బయలెపుడు నన్నెరుంగదు । బయలెప్పుడు
జేయబోదు । పనులెవ్వైనర్ ॥ * * ౬౦

కం॥ బయలనిన నిత్యవస్తువు । బయలన నొకరీతినుండు
బ్రహ్మాండములో । బయలనిన కండ్లబడనిది । బయలన బ్రహ్మాండ
మవల బరిగెడిదిసుమీ ॥ * * * ౬౧

కం॥ బయలనిన నేనులేనిది । బయలనిననుపాధిగాన బడనిది యెపుడున్ । బయలనిన పలుకులేనిది బయలిట్టిది యనుచు దెలియ బడ దెవ్వరికిన్ ॥ * * * * * ౬౨

కం॥ చెప్పి చూపించరానిది। యప్పాయల్లదుగా చూడు మని నేనీకున్ । చెప్పిచూపిస్తి మరువకు । యెప్పటికిది నిమ్మ్రలేని యెరుకను విడరా ॥ * * * ౬౩

కం॥ ఉన్నదిగద నేజెప్పిన । దన్నా దాన్నుండజూచి తలగుము మృషయా । నిన్నంటియున్న సంపద । లన్నియుగాని నీవు వచ్చి । నట్లుమృషగుచున్ ॥ * * * ౬౪

కం॥ పంచకోశముల సంచును । మించినదీయెరుకయనుట । మేలాబయలం । చెంచినదగు నాముచ్చట నంచిత సద్భక్తియుక్త । అమితాసక్తా ॥ * * * * ౬౫

కం॥ లేని నేననుశరీరము । లోనబయట గలిగినట్టి లోకసమితికిన్ । లోనబయటగలబయలిదిదీనందే లేకమనము తిరుగుటమనఘా॥

కం॥ ముడిబడి కర్మము జ్ఞానము । విడువక నారెండువెలసె । విశ్వమనన దే । కడువేడ్క బయలుగనెనా । ఘుడిమైనను నిల్వలేక కలైపోవున్ ॥ * * * * * ౬౭

కం॥ సకలంబులేని బయలున । సకలములేని దిటకొచ్చి చనె నాలేనం । చుకనితా లేచిపోయిన । నికనిలిచే బయలునెరుగ । నేదుండునురా ॥ * * * * ౬౮

కం॥ ఉన్నలేనేమొయనకన్ । వున్నది బయలనుచుయేమొ వుంటెని లేనం । చెన్నులేనట్టి నిన్నును । పన్నగగని లేనినీవు । పరుగిడవోయీ ॥ * * * * * ౬౯

కం॥ రెండువస్తువుల నడుమ । నఖండంబిదె కానుపించు గద దీనిని నీవుండి కనుగొని చనందగు మండిత సత్కీర్తిసాంద్ర। మానవ చంద్రా ॥ * * * * * ౭౦

కం॥ ఉన్నదానందమె నిజముగ। నెన్నడులేనట్టి మనము। మే తెంచిటయా। తిన్నని ముచ్చటలాడితి। మిన్నియిక మనము బోతె। యేదిరమాటా॥ * * * * 20

కం॥ ఓపాప రూపబయలే, పరమాత్మనుచునమ్మి। లేనట్టినినున్। ఆపోజ్యోతి సనుచు దెలిసి పట్లనె లేనటంచు చేరు ముళిక్కీ॥ * * * * * 21

కం॥ ఇచ్ఛారాహిత్యంబునె స్వచ్ఛంబగు బోధయనుచు। సజ్జనులని యీ। యిచ్ఛనెకూడనిదనిరా। స్వచ్ఛందముల మాటలన్ని। సత్యము వినరా॥ * * * * 23

కం॥ ఏయాపేక్ష జనించిన। నాయాపేక్షెల్లమాయ। యని తెలియదగున్। ఆయాసమానుదానను। ధీయని యవి విడువ దగును। క్షేమము కొరకై॥ * * * 24

కం॥ మనమీ బయలున లేనిదె। మనకు మనమెవచ్చి। నిల్చి మనమేగిన। నేమనకమనజోలి గొనకన్। తన కైతానుండి యున్న దదుగోకనరా॥ * * * * 25

—( ఎరుకలక్షణము )—

కం॥ లేనినీకలిమి వంధ్యా। సూనునివలె పుష్పుర ప్రసూనమువలె। స్వప్నానందమువలె। గంధర్వానీకస్థానము వలె। నని తెలియదగున్॥ * * * * * 26

కం॥ నీతండ్రి జననమీాదట। నీతనయుడు రాకమునుపు। నీవున్నపుడున్॥ యేతత్వమంతటనుగల। దాతత్వము నరసిమ్మపని తలపుము మిమ్మున్॥ * * * * 28

కం॥ నీవెనుమీ జీవశివుల్। నీవెనుమీ నేనుజగము నీవే సుమీ। జీవ శివైక్యము బయలున నీవు గలుగ లేదు లేదు। నీ మొదలెరుకటన్॥ * * * * * 29

కం॥ కదలీనా మెదిలీనా। కదులని యీబయలునిన్ను। గన

లేదుగదా । మొదలెక్కడ గనరాదిక । కదలుము నీకలిముళ్ళకి-
గాదలచినుతా ॥ * * * * * ౭౯

కం॥ మేనని ననుదెలసినగతి । నేననినిది బయలుగాను ।
నీవెరుగోయీ । నేననినిది నేననదని । నేనను నేనరయమృషని ।
నేమృషనోదుర్ ॥ * * * * ౮౦

కం॥ మేనొక్కటి నేనొక్కటి । నేనీమాటలను విడిచి నిను
నీతనువుర్ ॥ నేనేనని యచలముగని । నేనను నీవేగవోయి ।
నేమృషననుచుర్ ॥ * * * * ౮౧

కం॥ దేహమున కొంతనిజమని । మోహంబున నిల్వుకొను
టె మోసంబుగురు । ద్రోహముగుగానవిడువుము మోహంబును
మేల్కనికల మణిగినరీతిర్ ॥ * * * ౮౨

కం॥ చలనమన నీవుసుమ్మీ । చలనరహిత మనినబయలు
చలనమెకలయీ । చలనము చలన రహితము । గలదని కనితోలగ
మేలు కనునోయప్పా ॥ * * * * ౮౩

కం॥ యీగుర్తెరిగే మేనును । బాగుగ విడిచుండుమిందు ।
బట్టకుదేనిర్ । ఆగ[illegible]దానునుపిని । త్యాగము నీవుంటెమంచి ।
దారావోరీ ॥ * * * * * ౮౪

కం॥ వలదెక్కువ ముచ్చట్లక । చలనములేనట్టి బయలు ।
చందముగని యీ । చలనమగు నీకునీవే ॥ తలిదండ్రులటంచు దెలిసి
తలగుము చాలుర్ ॥ * * * * ౮౫

కం॥ బ్రహ్మందు లేక కలిగిన బ్రహ్మనునేననెడి మాయ
ప్రబలె జగంబై । బ్రహ్మను గనితానేగుటె । బ్రహ్మననే మాయ
శుపని । బ్రహ్మందుజుమీ ॥ * * * ౮౬

కం॥ నిరుపాధికమగు బయలున । మరిలేకనె కలిగినట్టి మా
రుతమునకే । పరియాయ నామములగు । కరువలియన యొరుక
యునిన । కడమాయయనర్ ॥ * * * ౮౭

కం॥ మానసము దేహిజీవుం । డానందము సత్తుచిత్తు లహముజగ । దధిష్ఠానంబునాక్షి సత్య । జ్ఞానము ద్రష్టనినసీవె సత్యము సుజ్ఞా ॥ * * * ౮౮

కం॥ జ్ఞానాజ్ఞానంబులు యీజ్ఞానంబువెకానివేరు గావెన్నటికీ । జ్ఞానాజ్ఞానానికిపని। జ్ఞానాతీతమునుగాంచి। చనుటయుసుమిత్రా॥
కం॥ స్థిరముగ నిల్చెద్రైతే । పరుగెత్తక భ్రాంతినిల్వ బడదా భువిలో । నరులు విమర్శించినతా । నొరుసుట మదిసుండుకోస । మోహానుకనరా ॥ * * * * ౯౦

—( యొసక వృత్పత్తి లక్షణము )—

కం॥ జలమందు మొదలులేకనె । జలచరములు బుట్టిపెరిగి సమసినరీతిక । అలపరిపూర్ణములోసీ । విలసజ్జననంబు స్థితియు । విలయము శౌరా ॥ * * * * ౯౧

కం॥ అచలమున మొదలు లేకనె। సచరాచర జంతునిచయ జననమగుయ । వున్నచెయమున లేనిజలచెర । నిచయము జన్మించినట్లు । నిశ్చయముసుమిూ ॥ * * * ౯౨

కం॥ నీరందు చూపలేకనె । నీరున జన్మించిమించి నీల్గినరీతిక తోరమగు బట్టబైటను । వారక గుర్తెరుగు మేను। వచ్చుక బోవుక॥
కం॥ జలధి జలచరములోపల । గలదా జెలరాశిలోని జలచరముపలేక । జలధి నిత్యంబనిత్యము । జలచర మట్లుచల చలము। సరణులు గనుమిూ ॥ ం * * ౯౪

కం॥ జలరాశికి బుట్టవుగద । జలచరములు వాటికవ్వె జనియించుగదా । కలకాలమిట్లు బయలెరుకల గాంచిన సంశయంబు। కడకేగుజుమిూ ॥ * * * * * ౯౫

కం॥ పుట్టదు గిట్టదునొకరిని । పుట్టించదు చంపబోదు భూమయెరుకదా । పుట్టును గిట్టును నొకరిని । పుట్టించును సమయు జేయు భూమకితరమై ॥ * * * * ౯౬

కం॥ కలలోపలయేనుగుపై । గలదోర మేల్కొనిననిల్వ గల డాగురుడుండా । దెలిపి బయలు నీవులేవిక । దలపకుమన నీకునిల్వ । దరమాతలపర్ ॥ * * * * * ౯౭

కం॥ ఎందరు లేదన్ననుతా । నెందుకు లేకుండుబయలు నేనీ వనకర్ । యందరు కలదని యన్నను । యెందుకుగలిగుండు యెరుక నేనీననుచున్ ॥ * * * * * ౯౮

కం॥ నీకచ్చిరానియూరును । నీకేగృహమచ్చినట్లు నీవా మేనర్ । నీకచ్చిరాడు నిపునిను । చేకొనుటయు మానవయ్య । శ్రేయస్కామా ॥ * * * * ౯౯

కం॥ నీరాంశ మస్రుగ్వోదన । సారము రేతస్సురెంటి సమ్మి శ్రంబే । ధారుణి తనువై నిలుచును ॥ నారీనరసంగమమున । నయ గుణరత్నా ॥ * * * ౧౦౦

కం॥ మనపన్నపు సూక్ష్మాంశము । వినుజల సూక్ష్మాంశ వలన వెలసెను ప్రాణం । బునురెండు గలసిపిండం । బనబ్రహ్మాం డంబనంగ ॥ బరగునువత్సా ॥ * * ౧౦౧

కం॥ రెండురీతుల గనంబడు । చుండేయీమేనిచేత చూచి బయలును । ద్దండత దీని నుళ్ళక్కొని యుండుము దీనందువాంఛ । నుంచకుశిష్యా ॥ * * * * * ౧౦౨

—( మతాలలక్షణము. )—

కం॥ అష్టాంగయోగములనతి । కష్టించె ప్రజలవలెనె । కష్టించకయీ । స్పష్టమగు బోధవినుసీ । కష్టములన్నియును తొలగి । కడకేగుసుమీ ॥ * * * * ౧౦౩

కం॥ ఇదిగాదు బోధనే । దెల్పెదరమ్మని నీకువేరే । పేరిడి యనలర్ । ముదమున నే బ్రహ్మనసుచు । వదరుమనిననవాడెమాయ వసుమతిలోనర్ ॥ * * * * ౧౦౪

కం॥ మంత్రయంత్రములు ముద్రలు । తంత్రంబులు నీకుదెల్పి

ధనమడిగెడియా । మంత్రజ్ఞుల మంత్రములకు యంత్రములకు నీగకు కూన ॥ * * * * ౧౦౫

కం॥ దీపముగతి కన్నులలో । పాపవలెఁ మెలగునిన్ను । పరమాత్మునిజవర । క్షీరజలు దలతు తెరుగక । నీపాల్పెరిగుండి నేను నినునమ్మెదునే ॥ * * * ౧౦౬

కం॥ తర్జనులవలనజూపును । నర్జున వర్ణగతనీల మనిశిష్యులకుఁ । దార్జన్యగురుడు నీవుని సర్జింపుమ సత్యమనుచు సజ్జన తిలకా ॥ * * * * * ౧౦౭

కం॥ పురుషోత్తముడని పూజలు । నరులొనరింప్రుదురు భువిని నానాచోట్లఁ । ధర మొదలగు భూతములను । చిరుత శిశువులాడుకొనెడి । చేష్టలరీతిఁ ॥ * * * ౧౦౮

కపి॥ రసమనదగనిదివస్తువ । బసవన్నకదెట్టులెరుక ప్రభువుకు దెలుసుఁ । రసమైతే విసము సగుణము । నసిగాదా ముచ్చటంత । చెవుల వినుటకై ॥ * * * ౧౦౯

కం॥ ద్వైతా ద్వైత విశిష్టా । ద్వైతులమని కీచులాడు । దయ్యములవలెఁ । ద్వైతాద్వైతవిశిష్టా । ద్వైతులతో కీచులాడ । దగునేనీకున్ ॥ * * * * * ౧౧౦

కం॥ అనుభవ వేదాంతులమని । తినరాని పదార్థమెల్ల । తినుధుర్జనులఁ । కనబోకుము తద్బోధను । వినబోకుము యెన్నటికి వివేకవిచారా ॥ * * * * ౧౧౧

కం॥ జిహ్వోపస్థ విషయము । లెవ్వాగలవో వాటివిడువలేని గురువులఁ । యెవ్వరుజేరి కొలుతురో । యివ్వసుధను వారుజెడుదు రిదినిజముసుమీ ॥ * * * ౧౧౨

కం॥ పాషండ మతమువారల । వేషంబులు జూచిశిష్య వితతి భ్రమించుఁ । యీషత్తిబో ధెరుగక । దూషింతురు విన్నకన్న । దుర్భాషణలఁ ॥ * * * ౧౧౩

కం॥ నిజగురుబోధ నెరుంగక । గుజగుజ శిష్యులకు జెప్పు । గురువులబోధల్ । భుజగవిషోపమ మగుసుమి । సుజనౌఘము మెచ్చదట్టి । సుద్దిని పట్టీ॥ * * * ౧౧౪

కం॥ తనువును విడిబ్రహ్మానునే । నను మునుపటి నీవిచార । మటు బెట్టిపుడున్ । నిను నీతనువును వేరని । యనకను పరిపూర్ణ మరసి యవివిడునదగున్ ॥ * * ౧౧౫

కం॥ కొందరు వైరాగ్యంబున । కొందరు తీర్థాటనమున । కొందరు కర్మం । బందున వ్రతజపతపముల । కొందరు నటియింతు రిట్టి । కోర్కెల మనుజుల్ ॥ * * * ౧౧౬

కం॥ కొందరు భక్తిత్రయమున। కొందరు యోగములయందు కొందరు జ్ఞానం । బందురమింతురు వారల । కందరికీబోధ యిష్ట । తౌనానాయనా ॥ * * * * ౧౧౭

—( అశరీరపద్ధతి )—

కం॥ భ్రమరహిత సహిత జనులకు । సుమనుసులను నరులసమము । జూచిన విశ్వం । బమరి లేకుండు నుండును । క్రమమునకలవంటి దగుచు । కడునిజము సుమీ ॥ * * * ౧౧౮

కం॥ కలతనను లేను కలనని । తలపోశెటి వారిమాట । తమకే నిజమా । కలలేనివారు కలవారలు వీరలె యొకరి నొకరు । నరయు రిరువురున్ ॥ ** * * * ౧౧౯

కం॥ కలవారికి మేలుకలో । గలవారికి జాగ్రతందు । కలహము గలదా । కలహించి రేనివారలు । కలవారలెగాని మేల్కు । వారు గారెన్నటికిన్ ॥ * * * * ౧౨౦

కం॥ సురలంచు వోచుకలనలె । నరుడెంచు నుబ్రహ్మయందు నఖిలజనంబుల్ । యరుదెంచి యజుని గన్గొని । బిరబిర తామేగు నిల్వ । బిడియంబగుచున్ ॥ * * * ౧౨౧

కం॥ రోగపు చేష్టలు బోయిన । రోగముగలదనినమాడ్కి । ర్యోయక నిన్నున్ । నీగుర్తెరుగుట మణగిన । నేగలనన నీదుమాట నిశ్చయమటరా ॥ * * * * ౧౨౨

—( జ్ఞానపద్ధతి. )—

కం॥ ఎరుగుట జ్ఞానముదానను । జరిగేపని కర్మమనుచు । జనులెన్నిరియీా । యెరుకయు కర్మము లేనిదె । పరిపూర్ణము పీటి నీవు । బట్టకుమెపుడున్ ॥ * * * ౧౨౩

కం॥ జ్ఞానంబు సత్వగుణమను । దానికి జన్మించె ననుచు । దామోదరుడా । మేనత్త కొడుకుతోనని । జ్ఞానమునకు జన్మ మొకటి । గలిగెగదోయీా ॥ * * * ౧౨౪

కం॥ పుట్టింది గిట్టుజ్ఞానము । పుట్టెననుచు కృష్ణమూర్తి । పురుహూతజుడౌ । నట్టితన ముద్దుమరిదికి । గట్టిగ వినజెప్పెనిందు । కలతేమోయీ ॥ * * * * ౧౨౫

కం॥ జ్ఞానముగు నీవు జ్ఞేయంబైన బయలుగాంచి । జ్ఞానమగునినునీవే । లేనంచు దెలియుమని తానా నరునకు వాసుదేవుడానతి యిచ్చెన్ ॥ * * * * ౧౨౬

కం॥ మనమచలమనదగదు । తగదనుటయు మనమచలమునకు । తగవేరని రెండని । లేవుమనమచలమని విను మనముళ్ళక్కి తెలియు విడుమనము మనన్ ॥ * * * ౧౨౭

కం॥ జ్ఞానము నేననొక్కటె । జ్ఞానము నే వేరటంచు । గనబోకుసుమీ । జ్ఞానము వచ్చును బోవును । జ్ఞానాతీతమును తాను । గాంచినదాకన్ ॥ * * ౧౨౮

కం॥ నీకలను వచ్చిపోయిన । లోకుల లోకములవలెనె । లోనిను గనుమీ । నీకలను నీవు మేల్కని । యాకలె నటువలెనె చూస్తె । యెటు నిల్వవురా ॥ * * * ౧౨౯

కం॥ అందరికల నీకలెకద । అందరు నీకలనువచ్చి । యగుపడిపోవన్ । కందువుగద నిన్నట్లనె । మందమతీ కనగదోయీ । మరిలేననుచున్ ॥ * * * * ౧౩౦

—( ఆకాశ లక్షణము )—

కం॥ చలియించనిదాకాశము । చలనంబే వాయువనుచు । పాటింపదగున్ । చలనమె విశ్వము నేనన । చలనమె తనువెరుక లనిన జగమనినసుతా ॥ * * * * ౧౩౧

కం॥ ఆకాశ మనినశూన్యం । బాకాశంబనిన సగుణ మాకా శమనఁ । కాకినలె నల్లరూపుది । యాకాశము మితములోన నన గుండాజూమీ ॥ * * * * * ౧౩౨

కం॥ ఆకాశ మనినకాలం । బాకాశంబనవిలంబ మాకాశ మనఁ । లోకమున చంచలంబగు । నాకాశము శబ్దరూప మగువిన వోయీ ॥ * * * * * ౧౩౩

—( అహముయొక్క నిర్ణయము )—

కం॥ అహమేతనువీ విశ్వం । బహమే జీవేశ్వరులన । నహ మేతద్వైక్యం । బహమే యహముకు మూలం । బహమణగిననణగు నిన్ని యనఘ చరిత్రా ॥ * * * ౧౩౪

—( భ్రమనిర్ణయము )—

కం॥ భ్రమయనిన పుట్టుకనినను । భ్రమకేనామంబులిట్టి । భ్రమవేనీవుం । భ్రమయీ మేనుజగత్తులు । భ్రమయెరుకయు మరు పురెండు । భ్రమెభ్రమ వినరా ॥ * * * ౧౩౫

—( యెరుక నిర్ణయము )—

కం॥ యెరుకసుమీ బ్రహ్మనినను । యెరుకసుమీ మాయ యనిన యెరుకేజీవుం । యెరుకసుమీ యీశ్వరుడన । యెరుకసుమీ నేనువిశ్వ । మదిసత్యమురా ॥ * * * ౧౩౬

—( మాటనిర్ణయము )—

కం॥ మాటసుమీ నేననినను । మాటసుమీమాయయనిన మరిజీవశివుల్ । మాటసుమీ బ్రహ్మనినను । మాటసుమీమేను జగము । మాటేసుమీ ॥ * * * ౧౩౭

—( ప్రతిబింబ నిర్ణయము )—

కం॥ ప్రకటమగు బింబమందున। ముకురముముకుర స్తబింబ। ములులేవెపుడుక్। ముకురంబువలన బుట్టును। ముకురస్థము దాని వలన। ముకురముదోచుక్॥ * * * ౧౩౮

—( కలమేలుకల నిర్ణయము )—

కం॥ లేనినీరాకడే స్వప్నానందము నీకుగురుడు పరిపూర్ణం బుక్। పూని తెల్పి మేల్కొల్పిన। నేననకను నీవుబోవ నీమేల్కదిరా॥ * * * * * ౧౩౯

కం॥ కలలో వానికి మేలుక। గలదని గుర్తెరుగవశమె కల మేల్కనినక్। కలవాడు గలడె తెలియను। తలపోయుము నిన్ను నీవు తగనీరీతిక్॥ * * * * ౧౪౦

కం॥ కలవాడు వానిచదువులు। గలవాతామేలుకనిన। గను గొను మటులక్। కలనిన్ను నీదుచదువును। ఫలమేమిక చాలు పెక్కు। పలుకులతండ్రీ॥ * * * ౧౪౧

కం॥ కలరాజు సకల సంపత్కలితుండై తానుమేలు కొనలే డెచటక్। కలనిన్ను వానివిధమున। తలపుము దలచితివెచాలు। ధన్యచరిత్రా॥ * * * * * ౧౪౨

—( అచల పరిపూర్ణప్రబోధ —

కం॥ తనకుదా నొరులుజణికిన। ధ్వనిబుట్టని-చోటబ్రహ్మ। తనుదానొరులుక్। చనకిన ధ్వనిగల-చోటని। వినుమాయము లేని మాయ। విడులేననినక్॥ * * * ౧౪౩

కం॥ మనసుకు వాక్కుకు దెలియని। ఘనవస్తువు భయుల్లు టంచు గనితూరెంటిక్। వినుసను విశ్వముగాగని। వినుమూలము లేనివీటి। విత్తరాశిస్వా॥ * * ౧౪౪

కం॥ శనిర్ణయమును జేయుడు। నేనని మహాత్ముడెప్పుడు

నేననువాడె । నానావిధాల వదురును । నేననుతనవంటివారి । నెప్పుడుగనినక ॥ * * * * * ౧౯౫

కం॥ మలుకలు లేవితోవను । చులకనగా దెలియవచ్చు । సుజనులకెల్లన్ । తలపదగు దీనినెప్పుడు । మలకల త్రోవలకుబోక మాన్యచరిత్రా ॥ * * * * ౧౯౬

కం॥ నామాట నమ్మవేమో । నీమానసమెరుగకంటె నేనీ మాటన్ । నామాట పద్యమైనను । యేమారకు దీన్నినీవి కెప్పటికప్పా ॥ * * * * * ౧౯౭

కం॥ సిద్ధాంతోక్తులు ఇవి । నీబుద్ధికి దెలిసుండి చదువ బోకుముపిటిన్ । ఒద్దుల వినుమనవారలు । యుద్ధమునకు కాలుద్రవ్వుచుందురు పెలుచన్ ॥ * * * * ౧౯౮

కం॥ ముద్దుగ యీగ్రంథంబును । పెద్దలముందరవచింప పిరుదీపియకుమీ । దిద్దెవరు తప్పులున్నను । వద్దనకను దిద్దనిమ్ము । వరకీర్తినిధీ ॥ * * * * * ౧౯౯

కం॥ నేనుగల మేనులేదని । మేనువనీవుండియిట్లు । మిడుకుటనేలా । మేనును విడిచను వినియెద । మానుగ నీవనక యున్న । మాయ వెనుమిన్నా ॥ * * * ౨౦౦

కం॥ కట్టులు పిడుకలు లేకను । యెట్టుంబలె నిప్పునిల్వకేగునా పుణ్యమిన్ । అట్టుంబలెనే నీవును । యిట్టిశరీరంబులేక । నెందుదున్నరా ॥ * * * ౨౦౧

కం॥ తనువునే గానసంబె । ఘనసుఖదుఃఖములు రెండు । గనుపడెనీవై గనుకతనువునీవొక్కటె । వినరానామాటనిట్టి । వెఱినబడకన్ ॥ * * * * * ౨౦౨

కం॥ ఎరుకలేనట్టి బయలున । బిరబిర నరుదెంచి యెవరు । బిలువనిదేతా । నరసి పరిపూర్ణమున్నది ॥ యెరుకేగితే చాలులేని । దెరుకనిలేకన్ ॥ * * * ౨౦౩

కం॥ తనువునే గానవంటివి । వినుసుఖదుఃఖములు నెవరి విర నాతోడన్ । వినజెప్పుము నేవినియెద । తనయాత్మప్రీతివనినన్ను । దండింతుజుమీ ॥ * * * * ౧౫౪

కం॥ అందరిమాటలకురికే । వెందుకు నామాటనమ్మి మిదె చాలును । యీ యందరు లేని జయలుగని । యందున నీలేమి యెరిగి । యరిగితే సరిరా ॥ * * * ౧౫౫

కం॥ నాబోతు రుచికిరుచిసిడు । నీబోధ నపేక్షచేత నేర్చిన వారిన్ । యేబాధలు బాధింపవు । బాబూయిది నీవునేర్చి । పతి యింపగదే ॥ * * * ౧౫౬

కం॥ తాము తమ తప్పునెరుగక । నామాటలు తప్పులనుచు నవ్వేజనముల్ । సామాన్యులనుచు దెలియుము । నిమానసమందు లెస్స । నిరుపను సుగుణా ॥ * * * ౧౫౭

కం॥ దప్పుప్పున జనినట్లుగ । నిప్పున చలిబాసినట్లు । నిజ మోగిరమున్ । వొప్పుగ దిన్నప్పుడెక్కుడ । ధప్పినగతి బోధవిన్న । దప్పునుబాధా ॥ * * * * ౧౫౮

కం॥ సాధనలు జెప్పిశిష్యుల । బాధలబెట్టేటి గురుని । బాట వదిలియే । బాధలులేని బోధను । సాధుల సేవించి వినుము । సద్గుణ శాలీ ॥ * * * * * ౧౫౯

కం॥ బోధలకెల్లను గురువగు । బోధసుమీ దీన్ని నీకు । బోధి స్తినియీ । బోధను వదలకుమెప్పుడు । సాధుజనస్తుతవివేక సతతా శోకా ॥ * * * * * ౧౬౦

కం॥ నీమదికీ నిజబోధను । ప్రేమతో నాటించదలచి । పెక్కు విధములన్ । నేమొదలుబెట్టి చెప్పితి । దేమాత్రము రాతిపగలు । యేమారకుమీ ॥ * * * * ౧౬౧

కం॥ నేనీకు జెప్పబూనిన । యీనిజసద్బోధ మనసు । కిమీ డిన్న వెనుకన్ । నీనా పనిదీరునురా । వోనాముద్దులకు మా । వోనగధీరా ॥ * * * * * ౧౬౨

కం॥ ఎన్నో గ్రంధజలదులను । తిన్నగ మధియించిచూస్తె । తేలెనుసారం । బున్నబయలుగని మృషయగు । నిన్నున్ నీమేను మృషని । నిలువకు మనుచున్ ॥ * * * ౧౬౩

కం॥ కప్పురము నిప్పుగలసె । చొప్పున వెలి గవలకండ్ల । జూస్తుండగనే । తప్పున గనరాదట్లనె । యిప్పుడు నినునన్నుబోధ ॥ నెరుగుము బుద్ధిన్ ॥ * * * * ౧౬౪

కం॥ దీవించియిస్తినేనీ । సేవించిన సేవమెచ్చి । చిత్తము లోనన్ । కావించు మెపుడుగానము । భావించిది ముఖ్యమనుచు । పావనశీలా ॥ * * * * * ౧౬౫

—( హీనగురుశిష్యోభయ లక్షణము. )—

కం॥ ఈవికాశించుగురుడును । నావద్దాక కాసులేదు నన్నడుగకుపో । పోవయ్య యనెడి శిష్యుడు । కేవల హీనాత్ములనుచు । కీర్తింపదగున్ ॥ * * * ౧౬౬

కం॥ దేవుడు తేతెమ్మనునా । జీవుడు లేదనుచుమదిని । శిడీ ముడి పడునా । భావమున దెలిసి యిద్దరు । నావిధమున నడువవలయు । నందరు మెచ్చన్ ॥ * * ౧౬౭

కం॥ గురుశిష్యుల లక్షణములు । గురుశిష్యుల బోధరీతి గురు గీతార్థం । బెరిగిన నరులకు మెప్పగు । నెరుగనియా మూఢనరుల కిష్టతియగానే ॥ * * * ౧౬౮

—( గురుశిష్యోభయ లక్షణము )—

కం॥ తనసంతతి పైగలదయ । తనశిష్యుని మీదనుంచ దగు గురుడెపుడున్ । తనధనము మనసు తనువును । తనగురునివటంచు దల్చు । దగుశిష్యుడగున్ ॥ * * * ౧౬౯

—( నీతి ప్రబోధము. )—

కం॥ కోటివిధంబుల జెప్పిన । చేటొదవేటి తనదు పూర్వ । చేష్టలు విడకన్ । [illegible] ద్వావిదము । నాటనమొనరించు నతని । కతడుకు నెబ్బోధా । * * * ౧౭౦

కం॥ బంగారువంటియీా । బోదాంగీ కరంబులను జేరి యుదివిని
పారీ౯ । భంగపరచ దలచెడియా । వెంగళులకు జెప్పకుమని వేడెద
నిన్నూ౯ ॥ * * * * * ౧౭౧

కం॥ ప్రాకటముగ నిద్దురయిక । యోకధలను వినినరాదు ।
యీాబోధందుర౯ । రాకుండ దేమిచిత్రిమొ । ప్రాకృత నరమూాకకెల్ల
పావనచరితా ॥ * * * * * ౧౭౨

కం॥ క్రొత్తదంపతుల కూటమి । నెత్తెరగున లేమలంత ।
నిదురలుబోక౯ । మొత్తముతై కనునటువలె । బత్తులదిరి గేటిచిన్ని
బాలలకగునే ॥ * * * * ౧౭౩

కం॥ మనసరయక ప్రజలను విను మనిచదువకుబోధ బాధ ।
యనియిండ్లల్లో । పనులన్ని యాదిజేసుక । చనియెదరా సమయ
మంద । సహ్యామునసుతా ॥ * * * ౧౭౪

కం॥ వీనుల వినడీబోధను । నేనే బ్రహ్మనని నిక్కి । నీలైడి
వాడు౯ । మానికముగానవచ్చిన । దానినిరాయనుచు దలచు ।
తార్కికునిగతి౯ ॥ * * * ౧౭౫

ఒకరువిని మెచ్చవలెనని । సకల పురాణములువేద శాస్త్ర
శ్రౌత । ప్రకరమును నేర్చువిద్య । న్నికరంబీబోధమెచ్చ నేర్చునె
సుమతీ ॥ * * * * * ౧౭౬

కం॥ సాధారణముగ దెల్పకు ॥ మీాధర మానవులబిల్చి యీా
బోధను । బల్ మేధానిధి యాచించిన । బోధించుము వద్దులోభ బుద్ధి
సుబుద్ధీ ॥ * * * ౧౭౭

కం॥ ఏబోధ శిష్యులకుగల । యాబాధల నణచివేయు నదె
సద్బోధా । ఆబోధ యేదియనినను । యాబోదే సుమ్మిదిన్ని యిక
విడువకుమీా ॥ * * * ౧౭౮

కం॥ హెచ్చైన బోధదెల్పె । సచ్చరితుల కియ్యలేరు జనులు
ధనంబుల్ । గచ్చులుగొట్టిదిచ్చుల । కిచ్చినక్రియ నిట్టి నృతతి ।
నేమననోయీా ॥ * * * ౧౭౯

కం॥ కాకులవలె కూకలిడే । లోకులకీ కలకుబెదరి లోగుంద

కటర్ । మూకత్వమూనుచాలు । వివేకుడవై య్యుంటివేని వినినా మాటా ॥ * * * * * ౧౮౦

కం॥ పెద్దల నెవరిని జూచిన । ముద్దుగమాట్లాడీవారు। ముద మునజెప్పి । సుద్దుల కడ్డము జెప్పక । వొద్దికతో మ్రొక్కి వినుమ । వోపుణ్యాతమా ॥ * * * * ౧౮౧

కం॥ తనహితవెరుగని మనుజుడు । వినదా ప్రజనోక్తి దుష్ట ॥ వృత్తిగల సుయోధనుడు । దశాననుడు – విహితజనవాక్యము వినక కాదే । సమసిరిరువురుర్ ॥ * * ౧౮౨

కం॥ హద్దుసుమీ గురువాజ్ఞన । ముద్దుసుమీ గురునిసేవ । ముదమున జేయర్ । పద్దుసుమీ యిట్లుండుట । వద్దుసుమీ గురుని తోటి । వాదించుటముల్ ॥ * * * ౧౮౩

కం॥ జంబాల పోతుగోరునె । సంభవ నాశములబాపు । చక్కని బోధర్ । కుంభిని షండునకుండునె । రంభాసంభోగవాంఛ రంబనుగనినర్ ॥ * * * ౧౮౪

కం॥ ఎందరుదూషించితె యేమందురు మనవారెకాని । య న్యులెనీవా । యందరితో వాదించక । నందంబా నిట్టిబోధ । నర యరతంద్రీ ॥ * * * * * ౧౮౫

కం॥ కోపమె పాపంబనబడు । కోపమె హంకారమనుచు । కొనియాడబడుర్ । కోపమె తాపంబనబడు । కోపమె మృత్యువన బడును । కుటిలవిరహితా ॥ * * * ౧౮౬

కం॥ చెప్పదొణంగెను మనుతా । జెప్పని ముచ్చట్లుకొన్ని । సేమము కొరకై । యొప్పులకుప్పావోమా । యప్పాయని దువ్వు కొనుచు । నతిదయతోడర్ ॥ * * * ౧౮౭

కం॥ ఒప్పకుమీ పరబోధల ॥ తప్పకుమీబోధనెపుడు । దల చుట మదిలో । రొప్పకుమీసచ్ఛిష్యుల । చెప్పకుమీ దీన్నిదుష్ట । చెనటులకెపుడుర్ ॥ * * * ౧౮౮

కం॥ కూడకుమీ దుర్జనులను । వీడకుమీ సాదుమనుజ వితతి

స్నేహం । బోడకుమీ గురుసేనకు । పాడకుమీ పరులనింద। పాటల రీతిన్ ॥ * * * * * ౧౮౯

కం॥ మీరకుమీ గురువాజ్ఞను । చేరకుమీ దుష్టులంత । చేరినచోటన్ । దూరకుమీ బోధనువిని । ఏరకుమీ సాదుజనుల యందునతప్పుల్॥ * * * * ౧౯౦

కం॥ జనులనలె జపుపుపనులను । ననునిను జపవితతితిదిట్ట ననువకుమెపుటన్ । నినునీవు బాగడుకోకుము । నినుజోలరటం చుజనుల । నిందించకుమీ ॥ * * * ౧౯౧

కం॥ శ్రిద్ధబోధందునిలిపి ॥ అశ్రద్ధను నీనేప్పచేత ఝూడిం చితివా । బద్ధత్వమంతబాయును । బుద్ధికి సరిసడిలేదన్ని । బూన గదోయీ ॥ * * * * * ౧౯౨

కం॥ సంశయమె జన్మహేతువు । సంశయమే గురునిమాట చవిగొననియదీ । సంశయమె కీడునొదవును । సంశయమెడబాప్తి వేని । చాలునుసత్యా ॥ * * * ౧౯౩

కం॥ నరులంతమెచ్చనడునను । హరిహరశతమఖాము రాదు లకైనన్ । తరముగాదనగ మనకిక । తరమౌనన వశమెచూడు । ధాత్రినిపుత్రా ॥ * * * * * ౧౯౪

కం॥ అందరిని చణుకుచుందురు । కొందరు దుర్మార్గవృత్తి । కుటిలజనంబుల్ । యందరి నొగిచ్చి కరుసుచు । మందలవలె కోతు లుండు । మాడ్కినికుర్రా ॥ * * ౧౯౫

—( గురునిర్ణయము )—

కం॥ సదమలగురువెవరనినను। యదుగోబయ లిదుగొలేని । యూగురు తెరిగే । టిదగు శరీరముదీనిని । వదులుమనుచు నీకుజెప్ప । నచ్చినవారే ॥ * * * * ౧౯౬

కం॥ దిచ్చుతనపు శిష్యునిమది । నొచ్చినధనమియ్యడనుచు। నూహించిమదిన్ । యిచ్చకములాడబోకను । చెచ్చెరఝూడించు వాన్ని । సద్గురుడైతే ॥ * * * ౧౯౭

## —( నిజశిష్య నిర్ణయపద్ధతి )—

శం॥ గుడుతన నెంతమెచ్చిన । పరశిష్యుడు లొంగితిరుగ వలయునుమదిలో । మురిశి భయభక్తిలేకను । తిరిగిన చేటొదవు నిజము । తెలియగదోయీ ॥ * * * ౧౯౮

కం॥ శూరత్వమాత్మపనికై । వైరాగ్యము గురునిగొల్చు । వర్తనకెపుడున్ । యారీతి వృత్తిగలిగిన । నారీనరులేగిచనరె । నరకములోనన్ ॥ * * * * ౧౯౯

కం॥ మేలైన బోధవినుటకు । చాలావిఘ్నములు వచ్చి సమకూడినయే । లీలన్ విడుసచ్ఛిష్యుడు । వాలాయము బోధయందె । వర్తించుజుమీ ॥ * * * ౨౦౦

కం॥ గురుకనుసౌజ్ఞనుగనుగొని । పరిచర్య యొనర్చుచుండు భక్తుడు భక్తిన్ ॥ పరిపూర్ణబోధజెందును । పరమహాదారప్రచండ । బంగరుకొండా ॥ * * * ౨౦౧

కం॥ కమలంబులున్న కొలనుకు భ్రమరములే తెంచినట్లు । బాగుగబోధన్ । తమమదిగోరి గురునిపద । కమలములను గొల్వ సుజన । గణమే తెంచున్ ॥ * * * ౨౦౨

కం॥ త్ర్యక్షుని నిందించినయా । దక్షునిగని ప్రాణమిడిన । త్ర్యక్షు సతివలెన్ । యీక్షితి తనదేశికుని । నుపేక్షించిన జనుల తాను । పేక్షించదగున్ ॥ * * * ౨౦౩

కం॥ గురుని కపరాధియగునా । నరనాదుని దృపదునొంచు । నరుని విధమునన్ । ధరసచ్ఛిష్యవరుడు తన గురుశత్రునిచేతనైతె । క్రొవ్వణచదగున్ ॥ * * * * ౨౦౪

కం॥ పతిభక్తిగల యువతివలె । సతతము గురుభక్తి గలిగి । సచ్ఛిష్యుడిలన్ । స్థితిగుదుర సేవజేయును । ప్రతిరహితాద్భుతచరిత్ర పరమపవిత్రా ॥ * * * * ౨౦౫

## —( బోధకు ఆనధికారులు )—

కం॥ మనసున నొక్కటి దలచు । వాక్కుననొక్కటి బలుకు

చుండు । కుటిలుడు మరితా । తనువుననొక్కటి జేయును । విను
వానికి బోధదెల్ప । విహితమటోయీ ॥ * * ౨౦౬

కం॥ గురుడుతనయాజ్ఞలోపల । చరియింపగగోరునట్టి శిష్యున
కెపుడున్ । దురితంబు వృద్ధియైతా । నరకమునన్ గూలకున్నె ।
నరనుత చరితా ॥ * * * ౨౦౭

కం॥ సురవరుడహల్యకోసము । మరులొందిన రీతినెపుడు ।
మగుదురరజ్ఞుల్ । పొరుగూరు సాధులకుతమ । పురమునగల సాదు
లందు ॥ బుద్ధినిలుపకన్ ॥ * * * *౨౦౮

కం॥ కనకసుమగంధవాసన। తనకొనగాదలచిషట్పదము గొన
డటులన్ । వినదు లేనహమె బ్రహ్మం । చనిపల్కె నృతతినిల్వ ।
ననీయీబోధన్ ॥ * * * ౨౦౯

కం॥ జఠరజ నితులై ననుబహు । కఠినమనస్కులకుఘోర ।
కలుషాత్ములకున్ । శఠులకు జడమతులకివకు । పఠనాసక్తులకు
బోధ పట్టుమటంచున్ ॥ * * * *౨౧౦

—( అధికారి నిర్ణయము )—

కం॥ మనసున వాక్కున తనువున । పనియొక్కటె జరుపు
నట్టి । భక్తునికిదయున్ । వినుపించుము వినుమని । యీఘనబోధను
వానికతుక । గలదుడుగకుమీ ॥ * * *౨౧౧

—( శిష్యవిజ్ఞాపన )—

కం॥ అనిగురుడు బోధజేసిన । విని శిష్యుడు హర్షమంది ।
వేడుకతోడన్ । తనగురునితోటి విజ్ఞాపన మీరీతిగ నొనర్చె ।
పటువాక్ప్రౌఢిన్ ॥ * * * ౨౧౨

కం॥ నాకొరకు కష్టపడితిరి । మీకై మీరిటకువచ్చి । మిము
బాగడుటకా । కాకోదరేశుడోపం । డాకార్యము నాతరంబె యచల
మనస్కా ॥ * * * * * ౨౧౩

కం॥ తల్లివి దండ్రివి దాతవు । వల్లభుడవు బాంధవుడవు ।
వసుదీశుడవున్ । తెల్లమిగ దేవుడవు – నీ వల్లగదా యిట్టిబోధ ।
వర్తన వినుటల్ ॥ * * * ౨౧౪

—( గురుని కోరిక )—

కం॥ అనిశిష్యుడన్నమాటకు । మనమున హర్షించి గురుడు మరియిట్లనియెన్ । వినవోయి శిష్యరాయా । వినినాకోరికనుదీర్చ వేడుకయైనన్ ॥ * * * ౨౧౬

కం॥ నేజెప్పినట్ల జెప్పర । నేజెప్పిన బోధలెస్స నీకతికుంటె । నేజూతు నీచమత్కృతి ।। రాజితసుగుణైకసార । రమ్యవిచారా ॥

—( శిష్యప్రబోధము. )—

కక॥ అనిగురుడు తనను బల్కిన । వినిశిష్యుడు లేచిమ్రొక్కి వినుతించి ముదం । బునజెప్ప దొణగెమునుతా । వినినట్లుగ గురుని మదికి । వేడుక దోపన్ ॥ * * * ౨౧౭

కం। నేమొదలులేని మేనును । నాముచ్చట స్వప్నమనుచు। నమ్మదగుసుమీ । నేమేలుకొన్నలేనని । నాముచ్చట నేనునిల్వ । నరఘుడియైనన్ ॥ * * * ౨౧౮

కం॥ లేనినే లేకవచ్చిన । నేనేగిన నుండుజయులు । నేనెరుగనుయీ । నేనుండి దాన్నిగనుగొని । నేనేగితె మరలబుట్ట । నిక నెన్నటికిన్ ॥ * * * * * ౨౧౯

కం॥ లేని నారాకపోకలు । దేనందున దోచబడె । నదె జయులుసుమీ । దానిని గురుకృపచేగని । నేనేగిన రానుపోను । నిజమెన్నటికిన్ ॥ * * * * ౨౨౦

కం॥ తనువుకు నాకును వేరసి యునగూడదదెట్టులనిన । నన వరతంబున్ ॥ పనులన్ని తనువునేలేకను । జేయగ వశముకాదు । కావునసామీ ॥ * * * ౨౨౧

కం॥ సనువెమ్మసి హమ్మసితా । ససటిసుమీ బట్టబయలు । నాకైనేనే । తనువును జగమునుగైకొని । చనుదెంచుట చనుట నాకు । సహజముతండ్రీ ॥ * * * ౨౨౨

కం॥ ప్రకటమగు బట్టబయలున । సకలముతో లేకవచ్చి । చనుధర ఘడియన్ । నాకకోటిమాట్లనేరా । నాకనేళ్ళను లేనటంచు । నూహాపోడమినన్ ॥ * * ౨౨౩

కం॥ లేని నే నెరుగకుండిన । మేనుండదు నేనునిల్వ । మేనుం
డకయీా । మేనగు నాజోలోల్లని । దానిని గుర్తెరిగినేను । తలగితే
చాలుఁ ॥ * * * * * ౨౨౪

కం॥ మనము మన పెద్దలందరు । చను దేరక మునుపువారు ।
చనిరఁ గలయీా । ఘనమునుగని – మనమేగిన । చనదుగదా
మనలబోలి । సారవిచారా ॥ * * ౨౨౫

కం॥ మేను మజ్జనని నేనే । మేనికి జనకుడను నేను । మేను
లోకటయై । దేనందు సంచరింతుమొ । దానిని పరిపూర్ణమనుచు
దల చెదనయ్యా ॥ * * * * ౨౨౬

కం॥ మేనున్నదె నేలేకను । నేనెరుగను మేను లేక। నేనిల్వ
నులయీ । మేనుకు నేనేమూలము । గానునుమము మేమెసృజన ।
గావింతుమయా ॥ * * * * ౨౨౭

కం॥ నేనిల్వ జగములేకను । నేనేగిన జగములేదు । నిజమీా
జగముఁ । నేనును లేనప్పుడుగల । దానిని పరిపూర్ణమనుచు। దల
పోయుదగుఁ ॥ * * * * ౨౨౮

కం॥ లేని నే మాయమైనను । మానవులది మరుపుమూర్ఛ ।
మరణంబునుగా । ఘానిద్రయు సిద్ధిదెన । నేనవివిని మృషనినమ్మ।
నేర్తు నెవాటఁ ॥ * * * * ౨౨౯

కం। పనుభావ్యములను తాల్చిను । జనములునను గట్టి
యుంచ జనక నిలుతునా । చనుదొత్తు నాకు నేనై । కనుకనెనను
నమ్మదెప్పుడు । ఘనులగువారల్ ॥ * * ౨౩౦

కం॥ నానాభాషల చేతను । నానావిధశాస్త్రతతుల । నను
నమ్మటకై । నేనేరచించిపెట్టితి । నానా దేశములయందు । నరరూ
పముననఁ ॥ * * * * ౨౩౧

కం॥ ఒకచోట నప్పుడును । వేరొకచోటను మిడుకుచుందు
నొకచోటను నే । ప్రకటముగుదు లేకుందును । నొకచోటనుయిట్టిచేష్ట
లుండునునాకుఁ ॥ * * * * ౨౩౨

కం॥ కావేటి కాలువలవలె । నావల్లనె కల్పనౌను । నానా విద్యల్ । యీ విశ్వమందువిశ్వము । నావెంటనె వచ్చుపోవు॥ నావలెనెసుమీ ॥ * * * * * ౨౩౩

కం॥ నేనాడదాన నాదును । నేనేమగవాడనాదు । నేనే నన్నుగ । నేనీవటంచుగూడుదు । నేనేనను జరుపమనుప నీగుదు సుమ్మీ ॥ * * * * * ౨౩౪

కం॥ నేనుల మేనులకుప్పను । నేనుబయల్ నన్నెరుగదు । నేచనుదొతుగ । మేనై నిమిషములోనిది । మానుగనావృత్తినేనె మాయెనుసుమ్మీ ॥ * * * ౨౩౫

కం॥ నేనుగాకొకటిశుద్ధ । జ్ఞానము గలదనుచు బల్కు । జ్ఞానులమాటల్ । వూనివినదగదు – శుద్ధ జ్ఞానంబన నేనె నేను । లేనిది యానే ॥ * * * * ౨౩౬

కం॥ నేమాత్ర ముందున నియెను । నామాయల కూత లన్ని యరసిన సుశ్రీగ । యేమాయె మరణ మప్పుడు । యేమాయెను గురునిమాట నేమాయె నయా ॥ * * ౨౩౭

క ॥ నేనన్న నహ మహంబన । నేనుసుమీ యహమటంచు నేనెపుడంతే । నేనపుడు బుట్టుటది । జన నేను గతించుట మటంచు నీవెరుగయ్యా ॥ * * * * * ౨౩౮

కం॥ నేనన నాలవ దేహము । మేనన నాలోని మూడు మేనులిసుమ్మీ । నేను మేనన నవొక్కటె కానిది తనమూల మరయు । గనరాదు సుమీ ॥ * * * ౨౩౯

కం॥ అంగము లింగము గలసుటె । లింగ శరీరం బటంచు లెక్కకు వచ్చెగ । లింగం బంగమునెడసిన । లింగము శక్యాలను నేనె లింగంబనినగ ॥ * * * ౨౪౦

కం॥ లింగము విక్షేపంబన । నంగం బావరణమనిన నగునీ రెండే । లింగ శరీరము దీనికి । భంగము తనమూల మరయ బడి నప్పుడగుగ ॥ * * * * * ౨౪౧

కం॥ ఎరుకన మరుపన రానిది । పరిపూర్ణం బీశ్వరుడన బడు నెరుకెరుకన్ । మరచిన జీవుండనబడు । నెరుకచలము । నెరుగ నరుసు । నెరుక మరుపులున్ ॥ * * * ౨౪౨

కం॥ ఎరుకన సత్వగుణంబని । మరుపన తామస మటంచు మరి యీ రెండున్ । సరియైన రాజసంబని నరులెన్నిరి మాటివిడువ నర్థము సుమ్మీ ॥ * * * * ౨౪౩

కం॥ నన్నెరుగ నట్టి బయిటన్ । యెన్నడు లేనట్టి నేను యీ విశ్వమునై । వున్నట్టు లుండి నేలేందున్నది గని । నేనుబోతె దుందణాగుసుమీ ॥ * * * ౨౪౪

కం॥ ఈ యచల మొకటి బ్రహ్మని । మాయా మయమైన విశ్వ మంతయు । నేనంచాయ మెరుంగక ననునరు । లీయడబ్రహ్మం బటంచు లెక్కిడ నగుదున్ ॥ * * * ౨౪౫

కం॥ భూమనుభద్రాచలమని । రాములనుచు లేని । నన్నర తుణమున నే । మీమాట నెరిగుళ్లక్కిని । నామాటను మరచియు నికీ నయమని తోచెన్ ॥ * * * ౨౪౬

కం॥ నాగురుడు నాకు దెల్పిన । యీగురు బోదంత మీకు యిప్పుడు నేనున్ । బాగుగ విన జెప్పితిసుమి । యోగురువర్య యని శిష్యు డూరక యున్నన్ ॥ * * * ౨౪౭

—( గురుని హర్షము )—

కం॥ విని శిష్యుని వచనోక్తులు । మనమున హర్షించి గురుడు । మస్తకమున జెయ్యునిచి తొడమీద జేర్చుక తనశిష్యుని మేనునివిరి తానిట్లనియెన్ ॥ * * * * ౨౪౮

కం॥ నీవంటి పుట్టి వాడిక । భూవలయము నందు ముందు బుట్టడు వెనుకన్ । నేవిన లేదున్నాడం । చీవేళ్ళకు నిన్నెచూస్తి నిట భళి శిష్యా ॥ * * * * ౨౪౯

కం॥ చందురుని చీమ ముద్దాడిందని నట్లిపుడు । నీవు యీ

సద్భోధర్ । జెందితివి నీకుసరి జగ మందెవ్వరు లేరు నిన్ను మది మెచ్చితిరా ॥ * * * * * ౨౫౦

—( గురు దక్షిణ )—

కం॥ అని మెచ్చి యేమి యిచ్చెద । వని గురుదక్షిణ నటంచు నతడడిగిన నన్నని పల్కె శిష్య రత్నము । వినియిది యిక ముట్టబోక విహరించు మనర్ ॥ * * * ౨౫౧

—( బోధ స్థితి నిర్ణయము )—

కం॥ విని శిష్యుడు గురుమూర్తిని గనుగొని చిత్తరువు ప్రతిమగా నిలిచున్నర్ । తనశిష్యుని హస్తములర్ గొని దగ్గరదీసి కొని కొడుకా యనుచుర్ ॥ * * ౨౫౨

కం॥ పరమ హంసాశ్రమ ధరుని । పరిపూర్ణపు బోధవాని పనులు సమమె । వార్నెరు గెరుకక నుతి నిందలు । గరపిన తత్వ లము ప్రజలకగు నిజము సుమీ ॥ * * ౨౫౩

కం॥ అర్థము దెలియక గ్రంథము । వ్యర్థంబని నిందజేయు వ్యర్థుల మాటల్ । వ్యర్థములని యీ గ్రందం । బర్థము సద్గురుని వలన బాగుగ వినుడీ ॥ * * * * ౨౫౪

కం॥ ఈ చెప్పిన గురుబోధను । తాచెవి నిడి బయలుగాంచి తన లేమినిజంబై చనియె శిష్యుడప్పుడు । లేచెను గురు డవలమాట లేదామీదర్ ॥ * * * * ౨౫౫

—( గ్రంధ సమాప్తి )—

కం॥ శరధి కరితురగ శితకర (౧౭౮౪) పరిమిత మైనట్టి శాలి వాహన । శకమందు రచిస్తి మాఘ పౌర్ణిమ । వరకవి దుందిభి యనేటి వత్సర మపుడుర్ ॥ * * ౨౫౬

కం॥ పది యిరువై యైదులు యీ । సదమల కందములు వీట్ని (౨౫౦) సదయా మతులై । ముదమున మీరు వినెదరని మదిలోపల దలచి చేస్తి మానవులారా ॥ * * ౨౫౭

కం॥ ఇతర మెరుంగని సతమందతి మ్మృషయై కానుపించు । నట్టి మనము । యీ కృతి గురు శిష్యులు । వారల యితరేతర వాగ్విలాసలివి మృషిలు సుమీ ॥ * * ౨౫౮

—( గ్రంథ ఫలశ్రుతి )

కం॥ ఎవరీ పద్యము లన్నియు । వివరింతురో వారికెల్ల విద్యావిద్యల్ । దవిలి బాధింప వెన్నడు । భవనాశ స్థితులు లేక ప్రబలుదు రెపుడున్ ॥ * * * * ౨౫౯

కం॥ పాటసుమీ భక్తులకిది । బాటసుమీ బోధజెంద భ్రమ రాకుండన్ । కోటసుమీ కందములను । తోటసుమీ దీన్ని తొలగ ద్రోయక వినుడీ ॥ * * * * ౨౬౦

కం॥ ప్రతి దినము జదివి యెవరీ ప్రతి నర్చన జేతురట్టి ప్రజలకు బోధ స్థితి కుదుర గలదు । గురుకృప కతి పాత్రులు వారు వారి కడ్డము గలదే ॥ * * * * ౨౬౧

ఇతి శ్రీమద్భాగవత కృష్ణ విరచిత తురాతురోపాధి
ద్వయ దోషరహిత పరమ తత్వ కంద పద్య
ములు ప్రబోధ చూడామణి
స ం పూ ర్ణ ము.

శ్రీ సద్గురు మహారాజుకు జై.





ఓం

శ్రీసద్గురు పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భాగవత కృష్ణస్వాములవారి స్తోత్రం

భక్తిపూర్వకముగా చేయబడిన

## సీస పద్యములు.

—(౦)—

సీ॥ గురుపుత్రులార మద్గురుమూర్తి స్తోత్రంబు । రచియింప బూను నావచనములను । వినవేడ్క గలిగిన వినరయ్య వినిపింతు । తప్పులుండిన వాటి దాచబోక । దిద్దవలసినది మీ దేశికేంద్రుని మీద । మీకుభక్త్యున్నట్టె నాకుగలదు । గాని మీవలెనేను కవిత జేయగజాల । చాలనంచని విడజాలతోచి ॥ నట్లుజేయుదు మీరంద రభయమిడిన । ననుచు విజ్ఞాపన మొనర్చి యాజ్ఞగొంటి । భాగవత వంశభవకృష్ణ యోగిరాజ । ధీవిశారద మామక దేశికేంద్ర ॥ ౧

సీ॥ శ్రీకాంతతోబుట్టు శేకదాయనజాలు । మోమున చిరునవ్వు మొలకలెత్త । అరవిందములకిందు పరుపజాలినగొప్ప । కనులందు కరుణదా గడలుకొనగ । కోటి మన్మథులైన దీటుగానటువంటి । సుందరత్వము మేను సందడింప । అజ్ఞాన నృతతి మోహాతిరేకమడంచు పలుకుల నమృతంబు జిలుకుచుండ । నభయవరదానములు చేతినాశ్రయింప । వచ్చి కనుపించుక నెదనావాంఛదీర । భాగవతవంశ భవకృష్ణ యోగిరాజ । ధీవిశారద మామక దేశికేంద్ర ॥ * * * * ౨

సీ॥ సారివహాపసిడి జల్తారంచు ధోవతి । కటిభాగమునజేరి కాంతులీన । పగడాల డాలును నగజాలు కుళ్ళాయి । తలమీద గూర్చుండి ధాటుజేయ । అతిచిత్రపటవి నిర్మితమైన కవచంబు ।

అద్దినట్లుగ మేనునావరింప । పాటలద్యుతిగల్గు పంచతో జతగూడి । ముతుకదుప్పటిమీద మురుపుజూప । కామధేనుపుభుజమెక్కి గంతులిడగ । వచ్చికనిపించుక నెదనా వాంఛధీర । భాగవతవంశ భవకృష్ణ యోగిరాజ । ధీవిశారద మామక దేశికేంద్రా ॥ * 3

సీ॥ మంచిగంధము కుంకుమనుగూడి నొసలందు । మూడు రేఖలు గల్గి ముద్దుగుల్క । రజితసూత్రస్వితరమ్యపవిత్ర । హారము కంధరప్రదేశమున వ్రేల । మిళితమై యొకవ్రేల మేలిమిబంగారు వుంగరంబులురెండు చెంగలింప । స్మరసతికుచముతో సరిదూగు మారేడు । బుర్ర హస్తమునందు విరపిగ । గురుని పేరు వచింపుచు పురముదిరిగి । వచ్చికనిపించు కనెదనా వాంఛదీర । భాగవతవంశ భవకృష్ణ యోగిరాజ । ధీవిశారద మామక దేశికేంద్రా ॥ * ४

సీ॥ కుంభినీధవుడైన గోవిందుడిలమీద । జంభభేదికి యను । జన్మడగుచు । అదితిగర్భమున కశ్యపునకు వామన । మూర్తియై జన్మించి ముదిముతోడ । యాచకాగ్రణివేష మమరదాలిచి తమ । కులధర్మమనెకదా బలినిజేరి । యాచించె నొకటి రెండడుగుల మేదినీ । తలమును ద్విజులది దలచికాదె । భిక్షమెత్తగబూనిరి బిడియమేల । భిక్షమే బ్రాహ్మణకులాని కక్షయమగు । భాగవతవంశ భవకృష్ణ యోగిరాజ । ధీవిశారద మామక దేశికేంద్రా ॥ * ౫

సీ॥ ఈజోలెతోగదా యిన్నాళ్ళు మీతండ్రి తాతముత్తాతలు ఖ్యాతిగొనుడ । యీజోలెతోగదా యిన్నాళ్ళు మీరంత । శుభశోభనములను చూరగొనుట । యీజోలెతోగదా యిన్నాళ్ళు మీరైన । భూసురోత్తములచే పొగడబడుట । యీజోలెతోగదా యికనైనమీరలు । బ్రతికినన్నిదినాలు మెతుకుదినుట । గాన యీజోలె మంచిదే మానకయ్య । భిక్షమే బ్రాహ్మణకులాని కక్షయమగు భాగవతవంశ భవకృష్ణ యోగిరాజ । ధీవిశారద మామక దేశికేంద్రా ॥ * * * ౬

సీ॥ గ్రంథమొక్కటెనీవు కంఠార్థములతోటి । చేసినావని వింటి. చెప్పవయ్య. । అధ్యాత్మలల్లినీ సకలదేవతలను । స్తుతికె స్త్రీవట

ఘాటిజూపవయ్య । నిఖిల వేదాంతార్థ నివహంబు కొద్దిలో । యిమి డ్చి స్త్రీవట వాటి నివ్వవయ్య । యీయన్నిటికి అర్థమే మొనాకెరిగించి పుట్టుచావులను బోగొట్టవయ్య । జన్మమరణములను జెంద చేతగాక॥ చాటుజొచ్చితి మన్నించు సదయహృదయ । భాగవతవంశ భవకృష్ణ యోగిరాజ । ధీవిశారద మామక దేశికేంద్ర ॥ * ౭

సీ॥ నన్నేల నేకదా నారాయణునివల్ల జానకమ్మకునీవు జనన మగుట । నాకుజెప్పనేకదా నయమైన గ్రంథముల్ । చేసి నీవవి యెల్ల వ్రాసికొనుట । నాకుజూపనేకదా నానావిధములైన । యోగ ముల్ సాధించి బాగుపడుట । నాకోసమేకదా శ్రీకారమాదిగా। స్వర యుక్త వర్ణముల్ చదువుచుంట । ముక్తినాకిచ్చుటకేకదా యుక్తి జేసి యనుదినము కోపగించినా మనసుగనుట । భాగవతవంశ భవకృష్ణ యోగిరాజ । ధీవిశారద మామక దేశికేంద్ర ॥ * ౮

సీ॥ నీవుజూపితెగదా నేజూడకన్నది । యైదుముద్రలనులక్ష్య ములమూటి । నీవునేర్పితెగదా నేనేర్చుకున్నది యష్టాంగయోగ ముల్ స్పష్టముగను । నీవుదెల్పితెగదా నేదెలుసుకున్నది । యష్ట తనువులవాటి కవలిదాని । నీవు జేయగగదా నిరుపమానాఖండ । పరిపూర్ణమునుగని భ్రాంతివిడుట । నీవునాపాలి వేల్పవై నెగడినగద నేను యిటువంటివన్నియు నేర్చుకొనుట । భాగవతవంశ భవకృష్ణ యోగిరాజ । ధీవిశారద మామక దేశికేంద్ర ॥ * ౯

సీ॥ తనయునిగానిన్ను గనిపెంచినట్టి నీతలిదండ్రి భాగ్యంబు తరమె పొగడ । వల్లభుగానిన్ను వరియించినట్టినీ యిల్లాండ్రభోగం బునెన్నదగునె । సఖునిగాగోనినిన్ను సరసోక్తులాడు నీస్నేహితుల శిరి జెప్పనౌనె । గురునిగానిన్ను గైకొని సేవగావించు । శిష్యుల ఫలము చర్చింపవశమె । శేషభాషాపతులకైన దోషదూర । భూరి వేదాంతశాస్త్ర విచారసార । భాగవతవంశభవకృష్ణ యోగిరాజ । ధీవిశారద మామక దేశికేంద్ర ॥ * * ౧౦

సీ॥ నఖశిఖపర్యంత మఖిలావయవమూర్తి । మూర్తివౌనిన్నతి మోదమునను । ధ్యానించి శిల్పి రత్నస్థగితాసన మునునుంచిపాద్యా

ర్ఘ్యములనొసంగి । యాచమనాభ్యంజనాదులుగావించి । వస్త్రమా ల్యాదిసద్వస్తువులిడి । పత్రిపూల్ ధూపదీపాన్నముల్ । తాంబూల ములు దక్షిణార్తిక్యములును । మంత్రపుష్ప నతినుతులొనరింతు పుచ్చుకొనుము । తక్కువెక్కువ లేమియు దలచబోక । భాగవత వంశభవకృష్ణ యోగిరాజ । ధీవిశారద మామక దేశికేంద్రా ॥ ౧౧

సీ॥ నీపాదతీర్థంబు నెగ్రోలుచుండేటి వారిదేకద మోక్షవైభ వంబు । నీతిప్రసాదంబు నేరుచిగొనుచుండు వారిదేకద మోక్ష వైభవంబు । నీపూజనమునిత్య నేమంబుగాజేయు । వారిదేకద మో క్షవైభవంబు । నీనిజతత్వంబు నీచేనెరింగిన వారిదేకద మోక్షవైభ వంబు । నిన్నుగని నన్నుమరిచేటి నిష్టబూను । వారిదేకద యా మోక్షవైభవంబు । భాగవతవంశ భవకృష్ణయోగిరాజ । ధీవిశా రద మామక దేశికేంద్రా ॥ * * * ౧౨

సీ॥ ఈగురుస్తోత్రంబు నెవ్వారాలించిన వారికిభాగ్యంబువచ్చు టరుదె । యీగురుస్తోత్రంబు నెవ్వరువ్రాసిన వారికి స్వర్గంబు వచ్చు టరుదె । యీగురుస్తోత్రంబు నెవ్వరునేర్చిన వారికి మోక్షంబువచ్చు టరుదె । యీగురు స్తోత్రార్థ మెవ్వరుజేశిన వారికిభ్రాంతులు వదలు టరుదె । గాన యీగురునుతి నతికాంక్షతోడ। చదివెదను జన్మమర ణముల్ సమసిపోవ । భాగవతవంశ భవకృష్ణ యోగిరాజ । ధీవిశా రద మామక దేశికేంద్రా ॥ * * ౧౩

సీ॥ ఈగురుస్తోత్రంబు యింపుతో జదివిన వారాపదలబట్టి వంచగలరు । యీగురుస్తోత్రంబు యింపుతో వ్రాసిన । వారంతకుని బట్టి వంచగలరు । యీగురుస్తోత్రంబు యింపుతో నేర్చిన వారు మిత్తినిబట్టి వంచగలరు । యీగురుస్తోత్రార్థ మింపుతో జేసిన। వారు మనసునుబట్టి వంచగలరు । గాన యీగురునుతి నతికాంక్షతోడ । చదివెదను జన్మమరణముల్ సమసిపోవ । భాగవతవంశ భవకృష్ణ యోగిరాజ । ధీవిశారద మామక దేశికేంద్రా ॥ * ౧౪

ఇతి శ్రీమద్రాజాధిరాజ మహారాజ రాజయోగీంద్ర చంద్రులగు శ్రీమద్భాగవత కృష్ణదేశిక స్వామిస్తోత్రసీసపద్యములు సంపూర్ణము.

# జాలమాంబ తత్వములు

—(౦)—

దోహేరా హిందుస్తాని.

సఖీక హేసంసార్ మే బాలరూపఛబన్ జాయె ।
జిసూ ౹కహుంబ్రిహ్మ జ్ఞానినామరూపమిట్ జాయె ॥౧॥

కీ ర్త న.

పథమూ జెందాకానుము క్తీ పదవీగలుగాదూ । మంచి బుధుల శేవా లేకా తత్వా బోధ దెలియాదూ ॥ ప ॥

నిధనోద్భవములు అధికసూ క్ష్మములు । క్షుధతృష్ణలనే వ్యథలులేనిగురు ॥ * * * * ౧

కులగోత్రనామధేయాదిగురుతూ లేకా । యపుడు విలయా వృద్ధిత్వాములాను వెలయాబొందాకా । పలుకూలకందాక యేతలపు లేకా । మిగుల । కలిమీ బలిమీ లేకాను చిత్కళలూ గాకా । చలనములేక యచల భావమ్మున । గలశి మెలశి సంకల్పశూన్య గురు ॥ * * * * * ౨

తరుణీపురుషూడనేటి భ్రాంతితనకూ లేకా నిరతా । మెరుకా మరుపులాకుపరమై మరుగూ లేకా । గురుతూగ వర్ణావర్ణములా నరయారాకా । సర్వపరిపూర్ణమై యించుకంతాబాధలేకా । తరతర భావము దగలక కాలాం । తరములేక పరతత్వమైనగురుపథమూ ॥ ౩

యందూజూచినాను యేడసందూ లేకా । నిత్యానందమై బుద్ధీహీనూలకందరాకా । నిందానిందాలకెల్లాను । అందబోకా । నాద । బిందూకళలతోటియేపొందూ లేకా । మందామందములందు నుదగులమి । నొందకమది నిస్పందియుడగు గురు ॥ * ౪

పట్టూముట్టూరా నీవు త్త బట్టూబయలై । పునికి । పట్టూ లేకా సాధూల కాస్పదముతానెయై । గుట్టూమట్టూ లేకాను శ్రీగురుగోప్య

మయ్యా । యింతా । మట్టానేటికొలదీ కీసమానరహితమై ।
యిట్టిదియని పచియింపరాక । గన్పట్టనశక్యంబై వెలిగెడుగురు ॥

నీమాకర్మామూలా నేటినిష్టలేకా । వితత । భూమ్యాది పం
చాభూతములా పొలుపూలేకా । కామాది శతృవర్గవికారి గాకా ।
ధర్మా । కామామోతుఫలమూల సత్కాంతులేకా । భ్రామికలను
పెంపారనియాత్మా । రాముడైన శివరామదీక్షితుని ॥ * ౬

పథముజెందాకానుము క్తిపదపీగలుగాదూ । మంచి । బుధులా
శేవాలేకా తత్వాబోధా దెలియాదూ ॥ * *

దోహేంరా హిందుస్తాని.

హీరాపడాబజార్మే రహేఖాక్ లప్టాయే
మూరక్ థేసోచెలేగయేచాతూర్లియె వుఠాయె

కీర్తన.

నరులారా త్వరగారారయ్యా గురునీగొల్తామూ । అంతః ।
కరణాయందా గురుమూర్తి నేమరకా తల్తామూ ॥ప॥ *

గురువూలనగా మేనెరుకాల నెరుగానీవారూ । యెట్లు ।
గురువూలయ్యేరీబోధా గుర్తెరుగానీవారూ ॥ * ౧

భక్తీసల్పాగురునీచేస । ద్యుక్తీ వినవానూ । యిట్టి । యుక్తీ
వినినామీదబంధాముక్తూలెడలూను ॥ * * ౨

రాజబాటగావించె శివ । రామాదీక్షితులూ । అదిమన ।
మీాజన్మానవింటె యాడీ వికమును పటిగతులూ ॥ * ౩

భాగావతకృష్ణాభిధాన బ్రాహ్మణునిజేరీ । వినెనూ । జాగూ
లేకా జాలమాయీాసద్బోధకోరీ ॥ * * ౪

కీర్తన.

ఈదారితో సాటిదేదారి గాదయ్యా । యేదారిద్రొక్కినాను
కాధార మానుమనసు ॥ప॥ సారామా దీక్షితయ్య సారాముదీని

కిద్యే । ఘోరాఘము లేదువట్టి నేరాము లెన్నవచ్చే ॥రీ॥౨॥ దేహీ దేహములుగాని దేశాము జూపియవల । దేహీ దేహముల దీసె దేశికోత్తములు మెచ్చే ॥రీ॥3॥ మోదాముజెంది జనులు సాదాము బెట్టుటాకు । వేదాముజదివీ వట్టి వాదాము జేసెరిందు ॥కీ॥౪॥ జ్ఞానాజ్ఞానముల నెరిగే జ్ఞానానికన్నపైది । యీనేను జెప్పేమాట దీనాగడ తేరవచ్చు ॥యీ॥౫॥ చలనాము లేనిదొకటి చలియించే దొకటిమిారీ । చలనామెులేక నిశ్చలనామెు తెలసికోరు ॥రీ॥౬॥ యెరుకామరుపూల నెరిగేయెరుకాకు । దొరుకనట్టీ । పరిపూర్ణబోధ దీనినెరిగితె తిరిగిపుట్టా ॥రీ॥౭॥ యెంతోచదివీని వారలంతామిాకెరుకె నాచే । రంతూజేయించీ వినసంతోషమైన దేమెు ॥యీ॥౮॥ వాలాయముగను భాగవత కృష్ణదాసుచే యీ । జాలామాంబీకవిని జన్మా మరణములాబాసే ॥ యీ॥౯॥ * * *

## మంగళహారతి.

౧ మామగురునకు మంగళం । బ్రహ్మాండ నగరునకు మంగళం ॥
పః॥ మానరహితునకు మంగళం । అసమాన చరితునకుమంగళం॥
౨ ద్వంద్వశూలునకు మంగళం । నిర్ద్వంద్వఖేలునకు మంగళం ॥
3 శూన్యశూన్యునకుమంగళం। బహు। మాన్యమాన్యునకుమంగళం॥
౪ శబ్దలోపునకు మంగళం । నిశ్శబ్దరూపునకు మంగళం ॥
౫ ఖేదముక్తునకు మంగళం । నిర్భేద రక్తునకు మంగంళం॥
౬ త్రిపుటిదూరునకు మంగళం । నిస్త్రిపుటిసారునకు మంగళం ॥
౭ బుధ్యతీతునకు మంగళం। నిర్బుధ్యుపేతునకు మంగళం ॥
౮ గళితతాపునకు మంగళం. । నిర్గళిత పాపునకు మంగళం ॥
౯ గోప్యగోప్యునకు మంగళం । అప్రాప్యప్రాప్యునకు మంగళం ॥
౧౦ దేవదేవ్యునకు మంగళం । నిర్భావ భావ్యునకు మంగళం ॥
౧౧ దీనభరణునకు మంగళం । అభి । మాన హరణునకు మంగళం॥
౧౨ కృష్ణనామునకు మంగళం । దుస్తృష్ణ భీమునకు మంగళం ॥
౧3 జాలమేశునకు మంగళం । స్తృతి । జాలనాశునకు మంగళం
౧౪ మామక గురునకు మంగళం । బ్ర। హ్మాండనగరునకుమంగళం॥

శ్రీమద్భాగవత కృష్ణ సద్గురు పరబ్రహ్మణేనమః

# శ్రీమత్ ఫీల్ ఖానా శంకరాయకృత

## దండకం

—)o(—

శ్రీసద్గుణోపేతులై । శ్రీచిదోల్లాసులై । నిత్య నిర్లేప్య । నిష్ప్రంశ యాత్యంత । మాహాత్మ్యముల్ గాంచి । శ్రీభాగవతవంశ దుగ్ధాబ్ధి । చంద్రస్థితిల్ మించు । శ్రీమద్గురుస్వామి । కృష్ణాఖ్య ధీరోత్తమానా । మనోవిత్తమా । చిత్తమానందముంబొందగా । ప్రాణులంబ్రోచు దేవా । యనంతప్రభావా । సుమంత్రార్థసుభావా । పరశ్వాఖ్య రామాంఘ్రిసేవా । నివాసైక భావా । భువిన్నేను మీవారిలో వాడనై । మిమ్ము సేవింతు । భావింతు । ధ్యానింతు । పూజింతు । పూర్వంబునం । మీర నేక ప్రజానంఘముల్ । జ్ఞాన దీపంబుగల్పించి । గుర్వంఘ్రి గొల్పించి । లక్ష్యంబుదాల్పించి । యుద్వత్తమంబెల్ల । నిర్మాలముం వేడ్క గావించి । యుండంగ । తద్వార్తలాలించి । మీపాదసాన్నిధ్యముంగాంచి । హర్షించి । యర్చించి । యుండంగ । నానాజన శ్రేణిజూడంగ । నన్నండ జేరంగ । నేమించి యోరోరి ఫీల్ ఖానయన్ పేరెలర్పంగ । నాంపల్లిలోనుందువా । శంకరాభిఖ్యరాయా । భవన్మాన సాయాస మేమయ్య । నీయాత్మలోనున్న । భావంబికన్ । దాచగా నేటికిన్ దెల్పరా । నిల్పరా । చిత్తముల్ గూల్పరా । యూర్ధ్వరం స్వల్పరాగంబులం బూనగా । నేటికంచాడగన్ । భక్తిసాష్టాంగముంజేసి । యోస్వామి నిష్కామిచామీ । కరాభాసమీచీన గాత్రా । పవిత్రాభవత్రాసజైత్రా । విచిత్రాతిచారిత్ర । మీసత్కృపాదృష్టి । సంలబ్ధికై వచ్చియున్నాను । నన్నెట్లు రక్షించెదో । యీ దృగాగోచరానేక । రూపంబులెల్లన్ సుఖాద్యంత దుఃఖంబులన్ । దేహసంబంధమున్ । జీవసంబంధమున్ నిత్యమంచున్ । నిజంబంచు । నేనమ్మియున్నాను । నేనెవ్వడో ।

యీదృగాగోచర । వ్యక్తవస్తుప్రజం । జెప్పుడున్ । నిత్యమో కాన్ । భావింపగా । దీనలాభంబు చేకూరుటల్ । చూడగా నెన్న డో । ప్రేమబోధింపవే । యాత్మశోధింపవే । ప్రీతి నంధింపవే । దింపనేశంక । పొందింపనే । తాల్మి నొందింపవే । తెల్వినందింపవే। చేతికిన్ నీప్రసాదార్థము । న్నాదు నిక్షేపిమా। బ్రహ్మదేవోపమా। జ్ఞాన దృగ్దీపమా । యింక తత్త్వోప దేశంబు గావింపుమా । ద్రుంపు మా । క్లేశమున్ దెంపుమా । జన్మపాశంబులన్ । మంత్రిమూర్తీ । దయాసారవర్తి । దిగంతస్థకీర్తీ । సదాభంజితార్తీ । జ్ఞానేక్షణ ప్రాప్తితో ॥ మూడునేత్రంబునన్ । మించువా శంకరా । పాపనా శంకరాశంసు చక్రాంకహస్తంబులన్ మించు । దామోదరా । సల్ల లామోదరా । నిత్య సత్యాధికారత్వమున్ బూను । భాషావిలా సాతి తీక్షానివాసా జనాశ్చర్యచర్యా । హిమాహార్యధైర్యా।మహా దార్యధుర్యా । అనిందాముకుందా । స్వనందా మరిందావక ధ్యాన మున్ । మీసమస్తాగ మామోఘవాక్యంబులన్ । స్తోత్రమున్ జేయగన్ । రెండు వేల్నాల్కలున్నట్టి । దర్వీకరస్వామికైనం వశం బే । మహీదేవతాముఖ్య । నేనెంతవాడన్ । నరుండన్ । జడుం డన్ । ఖలుండన్ । విటుండన్ । శఠుండన్ । కుబుద్ధిన్ । దురా చారుడన్ । నీచుడన్ । తామసుండన్ । నృశంసుండ నత్యంత చో రుండనయ్యా । మృషాభాషణుండన్ । విషాదంబులన్ । జెందు దుర్మార్గ శీలుండనా । పాపకృత్యుండ నేమందునో దేవ । నా చిత్త సందేహమున్ బాపవే । శీర్షమందున్ । భవత్పాదముల్ మోపవే నీదయాదృష్టియుం జూపనే । యోనవే నాదుతప్పుల్ । ప్రపంచోప కారా । స్మరాకారధీరా । అహంకారదూరా । సుధీరాజరాజా । మహారాజయోగానుకారా । వికారా ర్తిఘోరాంధకారాళిసూరా । దొరావిన్ పరాకీ । మొరాలింప రాదాయటం । చామహాభాగునిం చిత్తసింహాసనంబందు । పొందించి । యావాహనంబున్ । వేసం జేసి । గంగాంబురేఖాఘటశ్రేణితో । పాద్యమర్ఘ్యంబు । శుద్ధాచ మానంబు । స్నానంబు । వస్త్రోప వీతంబులున్ । గంధమాల్యంబు

లున్ । భూషణవ్రాతమున్ । దీపమున్ । ధూపమున్ । మంచి
నైవేద్యమున్ । దక్షిణా స్వీతతాంబూలమెల్లన్ । సమర్పింపుచున్
జుట్టుగావచ్చి వేడ్కన్ । నమస్కారముల్ । చాలపన్నెండుగావించి।
భక్తిన్ చతుర్ముఖ్య శిశూ్రిషలన్ జేసి । బద్ధాంజలివ్యక్త హస్తుం
డనై నిల్చియున్నట్టినా । విన్నపంబెల్లనాలించి । ప్రేమన్ విలోకించి
తామిట్లుభాషించిరో । వత్స నీప్రశ్న మేలైనదా । నీప్రకారం
బుగా । నీకలక్షోణిలో దెల్పుమంచాడగా । నెవ్వరున్ లేరు । సద్యో
ఘృతంబింపు శ్వావాళికిన్ । గాని చందాన । సాధోక్తులుం సొంపు
గావంచు । తామందు రేమందు । నీవిందు విచ్చేయుటల్ । పొందుగా
ముచ్చటౌనాకు । యీపెంపుబోధింపుదున్ । రక్తిబోధింపుదున్ ।
యుక్తిరెట్టింపుదున్ । వింటివావత్స । లోకాచలంబున్ । చలంబీ
యుగంబున్ । విమర్శించి । యీరెంటియాద్యంతమెల్లన్ । గురుశ్రీ
కటాక్షంబునన్ । దానెరుంగన్ । మదోన్మత్తమాతంగమున్ ।
సింహమున్ స్వప్నమందున్విలోకించి । తానాశమున్ బొందుచం
దాన । మాయావికారంబు । నిర్మూలమైపోవు । నీరీతియున్ గాన
కన్ । తామువేరొంకరీతిన్ । పరీక్షించితే । తద్వివేకంబె హీనం
బగున్ । తాల్మినాలింపుమంచన్న । తత్పాదధూళిన్ తలందాల్చి।
విజ్ఞాపనంబల్లనన్ జేసితిన్ । దేశికాయీచలంబెట్టిదో । యాచలం
బేమియుంలేని వస్తువ్రజంబెట్టిదో । వీనిపుట్టించువాడెవ్వఁడో స్వామి
యీరెండునెందుండునో । యేడకుంబోవునో । ప్రశ్నలుంచేయు నే
నెవ్వఁడో । నేడునిత్యాదిసందేహముందెల్పి । డెందంబునంటంగ ।
వేర్వేరునేర్పాటుగా । సానతియ్యంగ దేయంచు ప్రార్థింప । నిట్లా
నతీసాగిరోయన్న । యష్టాంగయోగంబులున్ । లెస్సగానష్టసిద్ధుల్
మంత్రప్రక్రియాజాలముల్ । జూడగానన్నియుఙ్ । నిత్యమంచున్న
దారందరుఙ్ । శాస్త్రిజాలంబనేతాలముల్ । పెక్కులుంగల్గి । జీవే
శ్వరవ్యక్తమైనట్టి ప్రాకారమా । దుర్గమంబా । మహాద్వారభాగం
బుకుం మొక్కుటేగాని । తద్ద్వారముందద్ధముఙ్ జేయుచుంవచ్చి ।
యానిత్యవస్తుక్రమం బంతయుంగాంచినట్లౌనె । యాతాళముల్ ।

గూర్పఁగా । తీర్పఁగా । బాలుధీమంతుఁడే సద్గురుండౌను । పాటింపఁగా
నాతఁడే నామరుద్ధేను చంచత్తమో । భానుబల్ తాలిమిఁ బూను ।
విశ్వప్రియుండౌను । వేరెవ్వరైనఁ । వెసందియ్యఁబోతే । అసాధ్యం
బు । తానొక్కటిందియ్యఁబోతే । బడుఁ తాళముల్ । కోటిలక్షల్
సహస్రింబు । తియ్యంగ కేలాడ దెవ్వారికిఁ । నొచ్చి వేసారియుఁ
నిల్వకఁ । బారియుఁ । బుద్ధినిఁ । దూరియుఁ । తెల్వి నేమారి
యుఁ । తామునేదారియుఁ । బట్టకఁ । గుందుచుఁ । చచ్చు
చుఁ । బుట్టుచుఁ । భ్రాంతులైయుందురా । మేలువీక్షింపరా ।
భూమిలో నింకవింటే । అహం బ్రహ్మమస్మ్యాది । భాష్యోక్త మహా
నీమహావాక్యముల్ । బట్టువారందరుఁ । మాయయేకాని । వేరొం
డుగాదయ్య । వీక్షించు మీ వియ్యడఁ తండ్రి । యింకఁ మరిఁ
దెల్పుదుఁ । పుత్ర । యష్టాంగయోగంబులఁ । ముద్రలుఁ గాంచి ।
యజ్యోతిముఖ్యప్రపలత్వంబులఁ జూచి । యానాని దే బ్రహ్మమం
చుఁ । లయాతీతమంచుఁ । స్థిరాపూర్ణ మంచుఁ । భవక్షేమ నాశ
ప్రదూరం । బటంచుఁ । పునర్జన్మ నిర్హేతువంచుఁ । నిరంతంబ
మా యాస్ఫుటంబంచు । నేతత్ప్రభావచ్ఛటా పూర్ణమంచుబ్బి ।
యదృష్ట తన్నష్టవాక్యంబుపై జ్ఞప్తిలేకఁ । ప్రవర్తించు వారంద
రుఁ । మాయలోఁ జేరువారేతలంపంగ । నాజ్యోతి యేయాదిగాగల్గు
వస్తువ్రజింబెల్ల బైలంచనంతంబటంచుఁ । మదినమ్మి విభ్రాంతి
యుఁ । వీడియుఁ । మాయయైనట్టి నేనంచు । నుల్లంబులోనమ్మి ।
నాకేంతయుఁ । మీఁదుగానిలడియుండే । నిరాకార । సర్గత్వ ।
నిర్వంచ । నాద్యంత । శూన్యంబునై । బట్టబైలై । స్వతస్సిద్ధమై ।
నిత్యమై । సత్యమై । సర్వకర్తృత్వ । భోక్తృత్వ । మంతృత్వ ।
యంతృత్వ । రక్షత్వ । శిక్షత్వముల్ లేనిదై యున్న దానిన్ ।
గురూక్త ప్రకారంబునన్ । దానెరుంగఁ । మఱిందాను నేనంచు ।
భాషించు వాక్యాళితో । తానె లేకుంటె । పైమాటబల్కు [illegible] ।
రాదెన్న డెట్లంటె । గాఢాంధకారంబు । విశ్వాస సంసిద్ధికిఁ [illegible]
తానాశ్రయింపఁ । సహస్రింగు ముందుఁ । నిలంబ్బో [illegible]

మేమిలేనట్లు । తానేమియున్ లేకపోతే । గణింపంగ। తారాకముం
దున్న । చందాననే । యెప్పుడున్నట్లుగానుండు । యీతెల్వి రీతిం
బ్రవర్తించకన్ । తమ్ముతామెప్పుడున్ । జూచుచున్ । నిక్కుచున్
నిల్గుచున్ । విప్రవీగంగ నున్నట్టివారిన్ । గనంజాలినీకేల । నామా
టలన్నమ్మి । నీవున్నదున్నట్లు । మున్నున్నదే నిశ్చయంబంచు ।
సందేహమున్ మానుమా । లేక । నేతత్ప్రకారంబునన్ । నీవు
వర్తింపవై తేని । నానాపురాణేతిహాసార్ధ । శాస్త్రీక శబ్దాంబు
వీచీ మహాబుద్బుదగ్రాహ బిందుచ్ఛటాయుక్తిచే । గానవై నట్టిబల్
సుళ్ళలో జిక్కబోయ్యేవు । మున్నెన్న దేనాల్గు ।లక్షప్రజన్మంబులన్
బడ్డఖేదంబులన్ । వెర్రిమోదంబులన్ । దెల్వి లేదా । మహాచింత
గాదా । మనభ్రాంతిబోదా । యమర్యాదగాదా । పరీక్షించరాదా।
సదాయాస మింకేల నోయన్న । నీకింతగా సత్కృపాదృష్టితో జెప్పి
నన్ । జుల్కగా నందరున్ దెల్పువాక్యంబు । లట్లెంతయున్నేడు ।
సామాన్యరీతిన్ విచారింతువో । యూసరక్షేత్రమందున్ । సుబీజం
బులన్ గూర్చి । చందంబులన్ । నాదుసల్లాపముల్ । నిష్ఫలప్రా
యమున్ । చేయకోయయ్య । యీనెయ్యమయ్యో । వృథారీతిగా
తోచెనా । సేయుమాలోచనన్ జక్కగా । నెట్లుగా నేర్పడున్ నీకు।
నేనర్థకామంబునన్ । ఖ్యాతి లాభాభిరామంబునన్ । దీప్రతిష్ఠాల
లామంబునన్ । లంచమున్ గాంచు । సామంబునన్ దెల్పుటన్ గాదు
నాసద్గురుశ్రేష్ఠుండు । నీచమార్గంబు తా మానతీలేదురా । రాజ
మార్గం బనుష్ఠింపగా జేసినారయ్య । వారంత వారెవ్వరున్ లేరు।
భూమండలిన్ వారికిన్ సాటివారేకదా । మింటికిన్ సాటిమిన్నె
సముద్రంబుబోలన్ సముద్రంబె । యిబ్బామికిన్ । సాటియిబ్బా
మియేకాని । యింకొక్కటింలేని చందాన । తాముండి కారుణ్యసం
[illegible]రై । యానతీజాలు వాక్యంబులన్ । కొందరాలింపరారీతి ।
యెట్లంటె । లోకంబునన్ । వ్యాఘ్రమున్ జేరి । నన్నివుభక్షించు
మంటే । రమ్మెత్తైన భక్షింపదా । తాన తావచ్చి భక్షించునే
గాని । బల్మిం బ్రబోధింపగా । బుట్టునే తెల్వి । దాలామనశ్శుద్ధి

యుఁగల్గి । యత్యాతురుండైన ధీశాలికే లబ్ధమాగాక। సందేహి
యావానికిఁ । పెక్కురీతుల్ విజృంభించు । శాస్త్రిబులుఁ ।
సత్యమంచుండు నెవ్వండో । యా దేవతాభ్రాంతిలోనుండు నెవ్వం
డో । పల్మారు వాదించు నెవ్వండో । గుర్వంఘ్రి సంపూజనల్
సేయఁడెవ్వండో । తానెట్టులఁ బల్కునో । తద్విధానంబుగాఁబల్కు
నెవ్వండో । వారిజనభ్రాంతుఁడెవ్వండో । విజ్ఞాన విభ్రాంతుఁడెవ్వం
డో । సద్భక్తి విభ్రాంతుఁడెవ్వండో । వైరాగ్యమే శ్రేష్ఠమం
చాడు నెవ్వండో ॥ బల్ మోక్షవిభ్రాంతుఁడెవ్వండో । బద్ధుండనం
చుండు నెవ్వండో । యెంతో భయంబొందు నెవ్వండో । ద్వైతై
ప్రవర్తింతునంచుండు నెవ్వండో । నిత్యంబదే నైతినంచుండు ।
నెవ్వండో । నిత్యానుభావం బింకంగావలె నెన్నెడటంచుండు
నెవ్వండో । నేనేనె వేరొండు లేదంచు భాషించు నెవ్వండో ।
లోకంబునఁ నామతం బెక్కువంచుండు నెవ్వండో । అద్వైత
విభ్రాంతుఁడెవ్వండో । యాద్వైత విభ్రాంతుఁడెవ్వండో । ఆకర్ణవ
భ్రాంతుఁడెవ్వండో । బల్ మన్నవభ్రాంతుఁడెవ్వండో । దుర్బుద్ధి
యెవ్వండో । యిత్యాదులౌ వారికిఁ । జెప్పరాదంచు నిర్దేశముం
జేసిరౌ । విన్ము నేఁడొక్కటైనఁ । సదాభ్రాంతియుం బుట్టకుండఁగ ।
నిజం బెవ్వరుం సూచనఁ జేతురో యంచు । నత్యంత మాసక్తియుఁ
గల్గి । సందేహముల్ లేక । బఁ సూక్ష్మబుద్ధిఁ । విజృంభించి
యుఁ । సూచనఁ జేయుచుండంగనే । యింగితంబంతయుఁ ।
గాంతలైనఁ । భువిఁ పూరుషప్రాణులైనం । తదీయ్యాశయం
బంతయుఁగాంచు । సన్మానసశ్రేణికిఁ । ద్వార శాబ్దంబులఁ ।
తన్మనోనిష్ఠలెల్లఁ పరీక్షించి । యీరాజమార్గంబు బోధింతు
రంచుఁ । వసిష్ఠుండు । సాందీపుడుఁ । భూమిపుత్రీ । పిత్రు
తుష్మాతలేశుండు । ప్రహ్లాదుడుఁ । నారదుండుఁ । మరిం దేవకీ
పుత్రుఁడౌ । యాదిగాఁగల్గు వారందరుఁ బల్కకాచాల । విద్వైక
శూన్యం । బవిద్వైక శూన్యంబునైనట్టి మార్గంబొగిఁ । దుర్ల
భంబంచు । చోరస్థితిఁ వచ్చినఁ । జెప్పరాదంచు బోధించి । వారు

ణ్యాదృష్టిన్ విలోకించినన్ ॥ చెంతకున్ జేరరావించి । వేడ్కన్ చతుస్సాధనసూక్తిరీతియున్ గల్గు వాడంచు నుల్లంబులో మెచ్చి । యిట్లాడనో వత్స । నీచిత్తమున్ నిశ్చలంబందగా । నిన్ని చందంబులన్ జెప్పితిన్ । దీనికన్నన్ పరం బెద్దియున్ । లేదు లేదయ్య ॥ నాపద్గురుస్వామి పాదంబులానయ్యయంచున్ । త్రిదీక్షావిధిన్ గల్గగా జేసియున్ । హస్తమస్తప్రవనంయోగమున్ జేసియున్ । సుపప్రిపాదంబులున్ ॥ మూడు గల్పించి వేడ్కన్ । చతుర్వేద యుక్తంబులౌ । నాల్గు వాక్యంబులెల్లన్ కటాక్షించి । తర్వాత సంపూర్ణ బోధాస్థితిన్ । ద్వాదశీషోడశీదారలన్ । వేడ్కమేల్కొల్పి । పన్నెండులో నున్న యర్థంబ దేచూడుమయ్యా । స్వతసిద్ధమై । నిత్యమై । సత్యమై । వెల్తియున్ లేనిదై । పూర్ణమయ్యున్న దంచున్ । కనన్ జేసి । తర్వాత తామిట్లు భాషించిరో యప్ప । నీవిప్పుడున్ చూచు టెల్లన్ । దయున్నను చూపించు టెల్లన్ । వేసం షోడశీమంత్రరీతిన్ । భువిన్ దాననన్నం విచారింపగాకింతైనయున్ । లేక తానున్న దంచెంతయున్ దెల్పినీరీతి నా దెల్పుచున్ బల్కె । నీమాయ మేలాఘనం । బందులన్ బుట్టలేనట్టికిన్ । మానముల్ బుట్టకన్ మించి తామేమి లేనిట్లు । నీ వెప్పుడున్ మూలమున్ లేని వాడయ్యు । నుత్పత్తి ముఖ్యాదులున్ లేకయున్ । గల్గినట్లంతయున్ । నీకెతో చున్ గదా కుర్రయం చున్ ప్రబోధించి । నీవప్పుడున్ జేయు ప్రశ్నాళికిన్ । మూరువాక్యంబులన్ । దెల్పెదన్ బాలకా విన్ । చలంబం టెయూ । మాయనిత్యాలు చలంబంటె । నిర్మాయపుట్టించు । వాడెవ్వడుం లేడు । విన్ తెల్పెదానేయనేక ప్రకారంబులున్ జేయుపాటింపగానాది వాక్యార్థమే శాశ్వతంబౌను । విన్ మాయతద్వ్యాప్తి । తానేయనేకప్రకారంబులున్ । జేయు వాక్యార్థమాపోదు । విన్మాయ తామాయమైపోవు । విన్ ప్రశ్నలంజేయు నీ వెప్పుడున్ । మాయ వేదృష్టికిన్ । గోచరంబైన వెల్లన్ । వెసం మాయయైనప్పుడున్ । లాభమే లేదు లేదంచు బోధించి యున్నట్టి । తద్వాక్యమే మంచు । వర్ణింతువర్ణింపగా నెద్దియున్ లేదు నేనేమియున్ లేదు । నీవేమియున్ లేదు । లేదుగా కొందరల్పుల్ భువి

స్నీనినాలించి । గర్వింతురౌనారు। గర్వించగానేమియహా । సంపంగన్
భృంగముంపీడితే । దానికిందమ్క్రా వేమహాను। నీబోధయుత్తుంగమహా
దీనినిప్పుడున్ । బోధయున్ జేయుమం చాడగనిల్లెరించితిన్ । దిన్నగా
దీనిమేల్పద్దలన్ జేరి । తత్పూజగావించి । యాతీరెరుంగన్ । దగున్
వింటివా మిత్రమా। మద్దేశికుంధ్యానమున్ జేతు । కృష్ణాఖ్యగురువగ్ర
గణ్యా । యగణ్యప్రపుణ్యా । సువాణ్యాఢ్యకారుణ్య । తారుణ్య
మూర్తీన్ । ప్రముఖ్యాసు విఖ్యాత । సౌఖ్యానిరాకార నిర్లేప్య ।
నిష్కార్యనిష్కామ్య నిర్దోషనిస్సామ్య । నిర్వాచ్య నిశ్చింత ।
యోగీన్ ॥ నమస్తే । నమస్తే ॥ నమస్తే నమః ॥ * *

శ్రీమత్ పీఠాన శంకరార్యకృత దండకం సంపూర్ణం.

ఇతి శ్రీమద్రాజాధిరాజ రాజమహారాజ యోగీంద్ర చంద్రులగు
శ్రీమద్భాగవత కృష్ణదేశికాచల పాండిత్య స్వగురు పరమ
గురు పరమేష్టిగురు సద్గురు జగద్గురు నిజగురు పరి
పూర్ణగురు చరణారవిందార్పణమస్తు.

సర్వం సంపూర్ణం.



ఫెరల్ ప్రెస్, మహాకాళివీధి, సికింద్రాబాద్ - (ద.)